లేజర్ చికిత్స
- అత్యంత అధునాతన లేజర్ పరికరంతో చిగుళ్ల వ్యాధికి ప్రత్యేక చికిత్స.
- 7గురు స్పెషలిస్టు డాక్టర్లు కలిగిన ఏకైక సూపర్ స్పెషాలిటీ దంతవైద్యశాల.
- రాష్ట్ర ప్రభుత్వ ఉద్యోగులకు, పెన్షనర్లకు వారి కుటుంబసభ్యులకు రీయింబర్స్‌మెంట్ సదుపాయం కలదు.

Professor, Endodontics
కేర్ సూపర్ స్పెషాలిటీ దంతవైద్యశాల
పొగతోట, నెల్లూరు. ఫోన్ : 2303300.



Licenced to Post without Prepayment (AP/VJ-16/WPP/2012-13)

స్థాపకుడు: నెల్లూరు వెంకట్రామానాయుడు స్థాపితం: 1930 జీవప్రదాత: నెల్లూరు శ్రీరామమూర్తి

Longest Living Newspaper in Telugu Journalism

# జమీన్‌రైతు

సంపుటి: 82 • సంచిక: 36 • 31-8-2012 శుక్రవారం • పేజీలు: 16 • విడి ప్రతి: రూ.5/-



Hotel D.S.R Paradise
A/C Restaurant
- 50 varieties of Tandoori
- All varieties of Indian & Chinese dishes
- Ample car parking

అయ్యప్పగుడి సెంటర్, నెల్లూరు.
ఫోన్ : 2354888, 2308666
సెల్: 8008256888, www.dsrparadise.com


## భలే ముఖ్యమంత్రి

# ఆయన పనిచేయడు... పోటీదారులపై బురద పోస్తాడు!

అసలే అంతంత మాత్రంగా వున్న రాష్ట్ర పరిపాలన ముఖ్యమంత్రి మార్పు ఖాయమన్న వార్తలతో పక్షవాత రోగి వలె మారిపోయింది. సెక్రటరియేట్‌లో ఒక్క ఫైల్ కదలడం లేదు. ఒక్క అధికారి పని చేయడం లేదు. ముఖ్యమంత్రి పేషీ నుంచి వచ్చే ఆదేశాలను కూడా తీసి పక్కన పడేస్తున్నారు. మంత్రులైతే ఆఫీసులకు రావడమే మానివేశారు. తమ మాట వినే అధికారి లేనప్పుడు, ఆఫీసుకు వెళ్లి ఏమి లాభం అన్న నిర్వేదం మంత్రులను ఆవహిస్తున్నది. రాష్ట్రాన్ని కలిచి వేస్తున్న కరవు, విద్యుత్ కొరత, ఫీజుల రగడ, పరిశ్రమల మూతతో లక్షల సంఖ్యలో ఉద్యోగాలు కోల్పోతున్న వారి మనోవేదన వంటి కీలక అంశాలు వేటిపైనా ప్రభుత్వ పరంగా వీసమెత్తు ఆలోచన చేసేవారు లేరు. నష్ట నివారణ చేపట్టాలన్న ఆసక్తి కూడా ఎవరిలోనూ లేదు.

గతవారం ముఖ్యమంత్రి కిరణ్‌కుమార్‌రెడ్డిని ఢిల్లీకి పిలిపించింది అధిష్టానం. అదే సమయంలో పిసిసి అధ్యక్షుడు బొత్సా సత్తిబాబు కూడా అక్కడే వున్నాడు. ఇద్దరితో ఢిల్లీ పెద్దలందరూ సుదీర్ఘంగా మాట్లాడారు. ఆ చర్చల తీరు చూస్తే, ముఖ్యమంత్రి మార్పు జరిగిపోయినట్లే కన్పించింది. కొత్త ముఖ్యమంత్రిగా మర్రి శశిధర్‌రెడ్డి పేరు ప్రముఖంగా ప్రచారంలోకి వచ్చింది. కానీ బొగ్గు కుంభకోణంపై పార్లమెంటులో బిజెపి వంటి ప్రతిపక్షాలు చేస్తున్న అల్లరితో అధిష్టానం దృష్టి మొత్తం అటు మళ్లడంతో ఆంధ్ర రాజకీయాలు వెనక్కు వెళ్లాయి. పార్లమెంట్ సమావేశాలు 7తేది వరకు జరుగనున్నాయి. అప్పటి వరకు బొగ్గు గోల కొనసాగించేందుకు సిద్ధమై వుంది బిజెపి. వారిని ఆపాలంటే, ప్రధానమంత్రి రాజీనామా ఒక్కటే మార్గం. కానీ అది కాంగ్రెస్‌కు ఆత్మహత్యా సదృశ్యం అవుతుంది. మన్మోహన్‌సింగ్‌ను మారిస్తే ఎవరిని పెట్టాలన్నది పెద్ద సమస్య. సంకీర్ణ ప్రభుత్వం కాబట్టి ఒక్క కాంగ్రెస్ ఇష్టం నడవదు. తతిమా పార్టీలు కొత్త ప్రధానిని ఆమోదించాలి. ఒక్కొక్క పేరుకు ఒక్కొక్క పార్టీ అభ్యంతరం వుంది. అందువల్ల పరువు పోతున్నదని తెలిసినా మన్మోహన్‌సింగ్‌ను కొనసాగించడం తప్ప కాంగ్రెస్‌కు వేరే గత్యంతరం లేదు. పార్లమెంట్ సమావేశాలు ముగిసే వరకు ఆ గోల తప్పదు.

తన పదవి కాపాడుకోవడానికి దొరికిన ఈ విలువైన సమయాన్ని బాగానే సద్వినియోగించుకొంటున్నాడు ముఖ్యమంత్రి కిరణ్‌కుమార్‌రెడ్డి. తనకు పోటీ రాగలరనుకొంటున్న వారందరి మీద బురద చల్లడం పనిగా పెట్టుకొని వున్నాడిప్పుడు. జైపాల్ రెడ్డి మీద గ్యాస్ బురద క్రుమ్మరించాడు. కెజి బేసిన్ గ్యాస్‌లో రిలయన్స్ మోసాన్ని అనుమతిస్తున్నాడని, ఆంధ్రకు రావలసిన గ్యాస్‌ను మహారాష్ట్రకు తరలించాడని ఆధారాలతో సహా బయటపెట్టి జైపాల్‌రెడ్డిని ఆత్మరక్షణలో పడవేశాడు కిరణ్‌కుమార్‌రెడ్డి. ముఖ్యమంత్రి పీఠానికి అన్ని ఏర్పాట్లు చేసుకొన్న డి.శ్రీనివాస్‌ను భ్రష్టు పట్టించడంలో కూడా కిరణ్ కృతకృత్యుడయ్యాడు. డి.శ్రీనివాస్ ఆరోగ్యం బాగాలేదని, కుర్చీ నుంచి లేవడానికి మనుషుల సహాయం కావలసి వస్తున్నదని అధిష్టానం పెద్దలకు సమాచారం అందించారు. ముఖ్యమంత్రి పదవి నిర్వహించడానికి తగిన శారీరక దారుఢ్యం ఆయనకు లేదని ఫోటోలతో సహా సాక్ష్యాలు పంపాడట. మర్రి శశిధర్‌రెడ్డి మీద చెప్పడానికి చాడీలేమీ దొరకలేదు. శశిధర్‌రెడ్డి అవినీతి పరుడు కాదు. ఏ వివాదంలోనూ ఆయన ప్రమేయం లేదు. దానితో, ఆయనకు ఒక చెవి వినపడడం లేదని డాక్టర్ రిపోర్టు తయారు చేయించి అహ్మద్ పటేల్‌కు అందజేశారట ముఖ్యమంత్రి వర్గీయులు. బొత్సా మీద మద్యం


కొరవ 14వ పేజీలో


## సిఐల బదలీల్లో

# గబ్బుపట్టిన పోలీసు శాఖ!

- పోలీసు శాఖలో అవినీతిపై బహిరంగ విచారణ ఇదే తొలిసారి.
- సాహసోపేత నిర్ణయం తీసుకొన్న డిజిపి దినేష్‌రెడ్డి.



అధికారుల బదలీల విషయంలో నెల్లూరు జిల్లా పోలీసు శాఖ గబ్బు పట్టింది. విలువ పోగొట్టుకొన్నది. గుంటూరు ఇన్స్‌పెక్టర్ జనరల్ ఆఫ్ పోలీసుగా వున్న హరీష్ కుమార్ గుప్త అనే అధికారి ఈ పుణ్యం కట్టుకొన్నాడట. జిల్లాలో ఒకేసారి 18 మంది సర్కిల్ ఇన్స్‌పెక్టర్ స్థాయి అధికారులను బదలీ చేశాడు ఐజి గారు. అది కూడా శిక్షణ కోసం దీర్ఘకాల సెలవు మీద వెళ్లబోయే ముందు ఈ బదలీల మీద సంతకాలు పెట్టాడట. ప్రతి సంతకానికీ ఒక ధర వుంది. ఒక లెక్క వుంది. ఆయన ఘనకార్యాలు ఒక్క నెల్లూరు జిల్లాకు పరిమితం కాలేదు. గుంటూరు, ప్రకాశం జిల్లాలలోనూ ఇదే పరిస్థితి నెలకొన్నదట. ఆయన గారి అవినీతి కంపు జిల్లాల సరిహద్దులు దాటి, హైదరాబాదు వరకు చేరడంతో డిజిపి దినేష్‌రెడ్డి సాహసోపేతమైన నిర్ణయం తీసుకొన్నాడు. మొత్తం 40కిపైగా బదలీలను నిలిపివేసి, ఐజి అవినీతి మీద బహిరంగ విచారణకు ఆదేశించాడు. గతంలో ఇక్కడ ఎస్పీగా పని చేసి వెళ్లిన రాజేంద్రనాథ్‌రెడ్డి, అడిషనల్ డిజి స్థాయి అధికారి హుడా కలిసి ఇందుకోసం రేపు 4తేది నెల్లూరు వస్తున్నారు. ఐజి గారి అవినీతికి బలైన పోలీసు అధికారులు, ఆ సమాచారం తెలిసిన ఇతరులు ఎవరైనా సరే వీరి వద్దకు వచ్చి, ఫిర్యాదు చేయవచ్చు. తెలిసిన వివరాలు చెప్పవచ్చు. ఏ పోలీసు అధికారి ఏ ఫిర్యాదు చేసింది రహస్యంగా వుంచుతామని, భయం లేకుండా ముందుకు రావాలని పిలుపు ఇచ్చాడు దినేష్‌రెడ్డి.

దినేష్‌రెడ్డి గారి ఆలోచన, నిర్ణయం అభినందనీయమైనవి. తమ శాఖలో జరిగే అవినీతిమీద బహిరంగ విచారణ జరిపించిన డిజిపి చరిత్రలో వేరొకరు లేరు. అయితే పోలీసు శాఖలో ఇటువంటి విచారణలు ఎంత వరకు సఫలం అవుతాయి. అన్నది వేరే ప్రశ్న. మెడ మీద తల వున్న ఏ పోలీసు అధికారి కూడా తమ పైస్థాయి అధికారుల మీద నేరుగా ఫిర్యాదులు చేయడు. లంచం విషయంలో అసలు నోరు విప్పరు. ఇప్పుడు దినేష్‌రెడ్డి కాపాడినా, రేపు ఆయన రిటైర్ అయిన తర్వాత తమ తాట వలుస్తారన్న భయం ప్రతి పోలీసులోనూ వుంటుంది. అందువల్ల ఈ విచారణ వల్ల పెద్దగా ఒరిగేది ఏదీ లేదు. కానీ పోలీసు శాఖలో కూడా అవినీతి మీద చర్యలు వుంటాయని, నిలదీసి ప్రశ్నించే వాడు వుంటాడని నిరూపించడమే దినేష్‌రెడ్డి సాధిస్తున్న పెద్ద ఘనత. అందుకు ఆయన్ను అభినందించాలి.

ఆరోపణల విషయానికి వస్తే ఐజిగా హరీష్ కుమార్ గుప్త వచ్చిన రోజు నుంచే అందరికీ తెలుసు. తమ రేంజ్ పరిధిలో ఏ పోలీసు స్టేషన్‌లో రాబడి ఎంతో, ఏ పోలీసు స్టేషన్ రేటు ఎంతో సమగ్రంగా సమాచారం సేకరించి పెట్టుకొన్నాడని చెప్తారు. బదలీ కోసం తన దగ్గరకు ఏ సిఐ లేదా ఎస్ఐ వచ్చినా, వారి రాబడి గురించి చెప్పి, తనకివ్వవలసిన లంచం మొత్తాన్ని నిస్సంకోచంగా అడిగి తీసుకోవడం ఆయనకు అలవాటని కూడా అందరికీ తెలుసు. కానీ మంత్రులు, ఎమ్మెల్యేల నుంచి లేఖలు తెచ్చుకొన్న వారికి మాత్రమే బదలీ అనే నియమం పాటించడం వల్ల రాజకీయ వాదులందరూ ఇంత కాలం ఆయన్ను ఇష్టపడ్డారు. అయితే శిక్షణ కోసం వెళ్లి పోతున్నాను కాబట్టి మంత్రుల మాటతో పనేమి వుందనే నిర్లక్ష్యంతో ఇప్పుడు చేసిన బదలీలు మాత్రం కేవలం తన రేటు చెల్లించిన వారికి మాత్రమే ప్రాధాన్యత ఇచ్చారట. అది మంత్రులకు కడుపు మండించింది. గుంటూరు మంత్రి కన్నా లక్ష్మీనారాయణ, నెల్లూరు మంత్రి ఆనం రామనారాయణరెడ్డిలిద్దరూ డిజిపికి ఫిర్యాదు చేశారు. దానిపై ఈ విచారణ ఆదేశం వెలువడింది.

ఆరోపణల విషయానికి వస్తే, అనుమానించ


కొరవ 14వ పేజీలో

## అవి శిశు హత్యలు

ప్రజలు తమ కోసం తమకు తామే ఎన్నుకొనేది ప్రజాస్వామిక ప్రభుత్వం. దాని లక్ష్యం ప్రజల సంక్షేమం. సంక్షేమం అంటే అర్థం ప్రజల కనీస అవసరాలు తీర్చడం. కనీస అవసరాలలో తిండి, గుడ్డ, గూడుతో పాటు విద్య, వైద్యం సైతం కలిసి వున్నాయి. ప్రజలందరికీ జీవించే హక్కు ప్రసాదించింది భారత రాజ్యాంగం. దాని అమలు బాధ్యత ప్రభుత్వాలపై పెట్టింది. కానీ దురదృష్టవశాత్తు మన ప్రభుత్వాలు, అది కేంద్రం కానీ, రాష్ట్రం కానీ ఈ నిర్వచనాలను మర్చిపోయాయి; ఈ బాధ్యతను విస్మరిస్తున్నాయి. గత నెల రోజులుగా మన రాష్ట్రంలోని ప్రభుత్వ ఆస్పత్రులలో సంభవిస్తున్న శిశు మరణాల పరంపర ఇందుకొక నిదర్శనం.

తిరుపతి రుయా ఆస్పత్రిలో 2012 జనవరి నెల నుంచి ఆగస్టు వరకు 681 మంది పసిపిల్లల ప్రాణాలు గాలిలో కలిసి పోయాయి. ఆగష్టు 15వతేదీ ఒక్క రోజు ఆరుగురు బిడ్డలు కన్ను మూశారు. వరంగల్ ఎంజిఎం ఆస్పత్రిలో మొన్న 24, 25 తేదులలో ఆరుగురు పసికందులు భూమాత వడిలో చేరిపోయారు. హైదరాబాదులోని అత్యంత ప్రతిష్టాత్మకమైన నీలోఫర్ ఆస్పత్రి శిశు మరణాలకు కేంద్ర స్థానంగా మారిపోయింది. ఇవన్నీ ప్రభుత్వ ఆస్పత్రులు. వాటికి వచ్చేది పేద ప్రజలు మాత్రమే. లక్షలు ఖర్చు చేసి ప్రైవేటు ఆస్పత్రులలో వైద్యం చేయించుకోలేని నిరుపేదలు ప్రాణాల మీద ఎంతో ఆశ పెట్టుకొని వస్తున్నారు. కానీ అవి ప్రాణాలు పోసే శాశ్వత కేంద్రాలుగా కాక, ప్రాణాలు తీసే నరక కూపాలుగా నడుస్తున్నాయి. ఆయువు మూడిన వాడే సర్కారు ధర్మాస్పత్రికి వెళ్తాడన్న నానుడి బలపడుతున్నది.

ప్రైవేటు ఆస్పత్రులలో చివరి నిముషం వరకు పెట్టుకొని, ప్రాణం పోయే దశలో తమ దగ్గరకు పంపుతున్నారని, అందువల్లనే ఎక్కువ మంది మరణిస్తున్నట్లు లెక్కలు కన్పిస్తున్నాయే తప్ప పిల్లల ఆరోగ్యం విషయంలో తమ అశ్రద్ధ ఏమీ లేదని ఆస్పత్రి అధికారులు సమర్థించుకొంటున్నారు. అది కొంత వరకు నిజమే కావచ్చు. కానీ అసలు కారణం మాత్రం – ఆస్పత్రులలో వైద్య సౌకర్యాల కొరత అనడం ఎవరూ కాదనలేని నిజం. గత కొంతకాలంగా ప్రభుత్వం ఆస్పత్రుల పట్ల దారుణమైన నిర్లక్ష్యం ప్రదర్శిస్తున్నది. పెరిగే రోగుల సంఖ్యకు తగినట్లుగా డాక్టర్లు, నర్సింగ్ సిబ్బంది, పారిశుద్ధ్య కార్మికుల నియామకం చేపట్టడం లేదు. తిరుపతి ఆస్పత్రిలో పడకల సంఖ్య 90 మాత్రమే. కానీ ఏ రోజు కూడా 250 మందికి తక్కువగా శిశు రోగులు వుండడం లేదు. దానితో అన్నీ కొరతగా మారుతున్నాయి. రాత్రి పూట డ్యూటీ చేయడానికి నర్సులు మిగలడం లేదు. దానితో రోగులను గమనించి, అవసరాన్నిబట్టి డాక్టరును పిలిచే దిక్కు లేదు. మరొకప్రక్క ప్రాణ దానం చేసే వెంటిలేటర్లు, ఇంక్యుబేటర్లు లేవు. రోగుల సంఖ్యకు ఎంత మాత్రం సరిపోవడం లేదు. ఉన్నవి కూడా పని చేయడం లేదు. వాటి మరమ్మత్తులకు, నిర్వహణకు నిధులు లేవు, సాంకేతిక సిబ్బంది లేరు. ఈ పరిస్థితులలో డాక్టర్లు చేయగల్గింది ఏమి వుంటుంది? అట్లని డాక్టర్లందరూ పవిత్రంగా డ్యూటీ చేస్తున్నారని చెప్పలేము. వారిలో చాలా మందికి స్వంత ప్రాక్టీస్ మీద వున్న శ్రద్ధ ప్రభుత్వ ఉద్యోగం మీద వుండడం లేదు. పైగా ఆదివారాలు, పండగల రోజులలో డ్యూటీకి రారు. తిరుపతి ఆస్పత్రిలో ఒక్క ఆగష్టు 15వతేదీ అంతమంది శిశువుల మరణానికి కారణం – ఒక్క డాక్టర్ కూడా డ్యూటీకి రాకపోవడం.

ప్రజల ప్రాణాలకు, ఆరోగ్యానికి బాధ్యత వహించవలసిన ప్రభుత్వం శిశు హత్యలకు పాల్పడడం దారుణమైన నేరం. లక్ష కోట్ల రూపాయల బడ్జెట్ వున్న రాష్ట్రంలో ఆస్పత్రులకు కావలసిన వెంటిలేటర్ల వంటి ప్రాణావసర పరికరాలకు డబ్బు లేదని చెప్పడం ప్రజలను మోసం చేయడమే. ప్రభుత్వం తలచుకొంటే కీలకమైన ఆస్పత్రులలోనైనా చాలినంత మంది సిబ్బందిని, పరికరాలను ఏర్పాటు చేయడం పెద్ద కష్టం కాదు. ప్రభుత్వాన్ని నడిపే వారిలో ఆ శ్రద్ధ లోపించడం వల్లనే పేద ప్రజల పిల్లలు అన్యాయంగా, అకాలంగా మరణిస్తున్నారు.

తిరుపతి శిశు మరణాలు రాజకీయ వివాదంగా మారడంతో, తెలుగుదేశం వంటి ప్రతిపక్షాలు ఆందోళనకు దిగడంతో ఆఘమేఘాల మీద పరికరాల కొనుగోలుకు నిధులు మంజూరు చేశాడు ముఖ్యమంత్రి. అయితే ఒక్క తిరుపతి ఆస్పత్రితో దీన్ని సరిపెడితే చాలదు, రాష్ట్రంలోని అన్ని ప్రభుత్వ ఆస్పత్రులను ప్రజల అవసరాలకు అనుగుణంగా నడపడానికి బడ్జెట్‌లో నిధులను ఏర్పాటు చేసి, సిబ్బంది నియామకాల విషయంలో ఒక స్పష్టమైన విధానాన్ని ప్రకటించడం అవసరం. ఇప్పటివరకు జరిగిన శిశు మరణాలను ప్రభుత్వ హత్యలుగా గుర్తించి, ముఖ్యమంత్రి ప్రజలకు క్షమాపణ చెప్తే బాగుంటుంది.

జమీన్‌రైతు

## జనవాణి

### జమీన్‌రైతుకు పురస్కారం!

జమీన్‌రైతు సంపాదకుడు నెల్లూరు డోలేంద్రప్రసాద్‌కు ప్రభుత్వం ఉత్తమ జర్నలిస్ట్ అవార్డు ఇచ్చి సత్కరించబూనడం ఆనందకరం. జాతీయస్థాయిలో ఎన్నో ఉత్తమ అవార్డులకు అర్హుడు డోలేంద్రప్రసాద్. గ్రామీణ ప్రాంతాల్లో జరిగే విశేషాలను వాఖ్యలతో జమీన్‌రైతులో వ్రాస్తుంటే మళ్లీ మళ్లీ చదవాలనిపిస్తుంది. సామాన్యులకు సైతం అర్థమయ్యే సంపాదకీయాలు వ్రాసే ఏకైక సంపాదకుడు డోలేంద్రప్రసాద్ అంటే ఏ మాత్రం పొగడ్త కాదని నా అభిప్రాయం.

కె.పెంచలయ్య — కొడవలూరు

### దోమల విజృంభణ!

వర్షాలు పడక ముందే నెల్లూరు నగరంలో దోమలు విజృంభించాయి. పగలు, రాత్రి తేడా లేకుండా ప్రజలను కరచిపెట్టి రోగగ్రస్తులను చేస్తున్నాయి. సహజంగా ఈ సీజన్‌లో డ్రైనేజీల్లో పేరుకపోయిన చెత్తాచెదారాలు, సిల్ట్ తీసివేసి, దోమల లార్వాలను చంపేందుకు ఆయిల్ బాల్స్ వేసేవారు. చీకటి పడ్డాక ఫాగింగ్ చేసేవారు. ప్రజలు ఎన్నుకొన్న ప్రజాప్రతినిధులు లేకపోవడంతో కార్పొరేషన్ అధికార వర్గం ఈ వ్యవహారంలో స్పందించడమే లేదు. ప్రజా సమస్యల పరిష్కారంలో ఇంత నిర్లక్ష్యం పనికిరాదు. ఈ విషయమై కమిషనర్ ఆంజనేయులు గారికి జంట ఎమ్మెల్యేలు దిశానిర్దేశం చేస్తే బాగుంటుంది.

పి.అరుణకుమారి — నెల్లూరు

### పనికిమాలిన ప్రభుత్వం

అసమర్థులు అందలమెక్కితే రాష్ట్ర పరిస్థితులు ఎంతగా దిగజారి పోతాయన్నదానికి కిరణ్‌కుమార్‌రెడ్డి సర్కారును ఉదాహరణగా చెప్పుకోవచ్చు. ఆయన ముఖ్యమంత్రిగా బాధ్యతలు తీసుకొన్నప్పటి నుంచి రాష్ట్రంలో పారిశ్రామిక ప్రగతి నిలచిపోయింది. విద్యుత్ చార్జీలు పెరిగాయి. విద్యుత్ కోతలు పెరిగాయి. అన్ని రకాల పన్నులు పెంచేశారు. నిత్యం రాజకీయ అశాంతి. ముఖ్యమంత్రికి ప్రజల బాధలు తెలియవు. పరిష్కార మార్గాలవైపు దృష్టి సారించని దండగమారి వ్యక్తిని కాంగ్రెస్ అధిష్టానం ఎందుకు ముఖ్యమంత్రిగా కొనసాగిస్తుందో అర్థమే కావడం లేదు.

బి.వినోద్‌రావు — నెల్లూరు

### పాపాలు పండుతున్నాయి!

మాజీ ముఖ్యమంత్రి వైఎస్.రాజశేఖర్‌రెడ్డి హయాంలో జరిగిన అక్రమ కేటాయింపుల వల్ల లబ్ధిపొందింది ఆయన కుమారుడు జగన్మోహన్‌రెడ్డి. కాని నేడు కేసుల్లో మాత్రం ముందు వెనుక ఆలోచించకుండా సంతకాలు పెట్టిన ఐఎఎస్ అధికారులు, మంత్రులు, పారిశ్రామికవేత్తలు ఇరుక్కోపోతున్నారు.

కొరవ 14వ పేజీలో

## 70 ఏళ్ల క్రితం ఈవారం

**5-9-1942**
**పేజీలు : 8 వెల: అణా**

### మద్యపాన నిర్మూలమునకు స్త్రీలు పూనుకొనవలెను

24వ తేదీన వెలువడిన హరిజన పత్రికలో గాంధీ మహాత్ముడు మద్యపాన విషయమై ప్రకటించిన వ్యాసమందు క్రింది విధమున తెల్పెను.

వెనుక సత్యాగ్రహమును ప్రారంభించి నేను కాలినడకన దండికి బయలు దేరినపుడు భారత దేశమున లక్షల కొలది స్త్రీలు నా విజ్ఞప్తిని ఆదరించి మద్యపాన నిర్మూలము కొరకు మిక్కిలి శ్రద్ధగా పని చేసిరి. అందరును రాట్నములపైని నూలు వడకసాగిరి. వేల కొలది స్త్రీలు సారా దుకాణములవద్దకేగి త్రాగుడును వదలివేయుడని త్రాగుబోతులను ప్రార్థించుచుండిరి. అపుడు చాలా మంది త్రాగుడును మానివేసిరి. వారిలో పరమనీచులగు వారు కొందరు యిటుల బోధించుచున్న సోదరీమణులను తిట్టుట, కొట్టుట మున్నగు దౌర్జన్యములను గూడా నినదించిరి.

కానీ దేశసేవా పరాయణులగు సోదరీమణులు ధరిత్రీదేవి వలన అత్యధికమగు శ్రమతో వాటిని అన్నింటిని సహింపగలిగి యుండిరి. మన దురదృష్టము వల్ల సత్యాగ్రహము విరమించుటకు పూర్వమే ప్రజలలో నిరుత్సాహమధికమైనది.

లక్షల కొలది స్త్రీలు దేశమంతట మద్యపాన నిర్మూలన సంఘములనేర్పరచి కట్టుబాటుతో పని చేయవలెను.

త్రాగుడుకు సంబంధించిన లెక్కలను బాగుగా చదివి అవగతము చేసుకొనవలెను.

## 50 ఏళ్ల క్రితం ఈవారం

**31-8-1962**
**పేజీలు: 12 వెల: 0-20 న.పై**

### చిత్తూరులో రంగాగారి గెలుపు

రంగాగారి స్వస్థానమైన సర్కార్లలోనే రంగాగారిని ఓడించడం ఇంతకాలంగా సంజీవరెడ్డి గారికి సాగుతున్నది. ఇప్పుడు సంజీవరెడ్డి గారికి ఆయువుపట్టయిన రాయలసీమలోనే సంజీవరెడ్డి గారిని ఓడించడం రంగాగారికి సాధ్యమైంది. బండ్లు ఓడలు, ఓడలు బండ్లు అవుతుంటాయి. జయాపజయాలు శాశ్వతంగా ఒకరినే అంటిపెట్టుకొని ఉండవు. 1951లో ప్రారంభమైన రంగా – సంజీవరెడ్డి పోరు, ఇంటా బయట జరుగుతూ రంగాలు మారుతూ, కడకు చిత్తూరులో ఈవిధంగా పరిణమించింది. ఇంతవరకు సంజీవరెడ్డిని వరిస్తుండిన విజయలక్ష్మి ఈసారి రంగాను చేపట్టింది. ఎప్పుడూ కటాక్షించే తిరుపతి వెంకన్నగూడా ఈ దఫా రైతు రంగన్నను ఆశీర్వదించడం అసాధారణ విషయమే. ఆంధ్ర రాజకీయాలలో శత్రుకూటాలుగా వస్తున్న ఈ రెండు వర్గాల శత్రుత్వం శాశ్వతంగా కొనసాగవలసిందేనా?

### తిరుపతి వెంకన్నకు రైతు రంగన్న మొక్కు

చిత్తూరులో విజయం పొందిన ఆచార్య రంగా తిరుపతికి పోయి వెంకటేశ్వరస్వామిని సేవించి తలనీలాలు అర్పించి వచ్చారు. ఆంధ్రపత్రికలో రంగాగారి క్రొత్త రూపాన్ని పాఠకులు ఈ పాటికే చూచి ఉంటారు. చిత్తూరు ఓటర్లవలెనే ప్రభుత్వ పక్షపాతిగా ఉన్న ఏడుకొండలవాడు గూడా ప్రతిపక్షీయుడు గావడం ఆశ్చర్యం.

### కిసాన్ కుటీరం

రంగాగారు ఒక కుటీరం నిర్మించుకొని పలమనేరునే తన కార్యస్థానం చేసుకుంటారట. నిరాదరించిన గుంటూరుకంటే పిలిచి గౌరవించిన చిత్తూరు ఆత్మీయం కావడం సహజంగాదా!

# నెల్లూరు ముచ్చట్లు

## నెల్లూరుకు ప్రధాని రాక!

ప్రధాన మంత్రి మన్మోహన్‌సింగ్ 8వ తేది సాయంత్రం నెల్లూరుకు రానున్నారు. 9వ తేది ఉదయం శ్రీహరికోటలోని షార్ కేంద్రం నుంచి జరిగే పిఎస్ఎల్వీ సి-21 రాకెట్ ప్రయోగాన్ని వీక్షిస్తారు. ప్రధాని హోదాలో మన్మోహన్ సింగ్ నెల్లూరుకు రావడం ఇదే ప్రథమం.

## ముఖ్యమంత్రి రాక

ముఖ్యమంత్రి నల్లారి కిరణ్‌కుమార్ రెడ్డి కూడా 8, 9 తేదీల్లో నెల్లూరులో ఉంటారు. ఆయన కూడా షార్‌లో పిఎస్ఎల్వీ సి-21 రాకెట్ ప్రయోగాన్ని ప్రధానితో కలసి వీక్షిస్తారు.

## హవ్వా... రామనారాయణ!

ఆర్థిక మంత్రి ఆనం రామనారాయణరెడ్డి ఏరుదాటిన తర్వాత తెప్పతగలేసే రకమని నెల్లూరు ఎమ్పీ మేకపాటి రాజమోహన్‌రెడ్డి దుయ్యబట్టారు. దివంగత వైఎస్ రాజశేఖర్‌రెడ్డి వల్ల అత్యంత లబ్దిపొందిన వ్యక్తి రామనారాయణరెడ్డి అని, ఆయన వైఎస్‌ను ఇష్టానుసారంగా మాట్లాడడం సిగ్గుచేటన్నారు. అన్ని విషయాలు ప్రజలు గమనిస్తున్నారని, ఆయనకు సరైన బుద్ధి చెబుతారని చెప్పారు.

## కొత్త పోలీసాఫీసు నిర్మాణం!

కొత్త పోలీసాఫీసు నిర్మాణానికి ప్రతిపాదనలు ఎస్పీ రమణకుమార్ రాష్ట్ర ప్రభుత్వానికి సమర్పించారు. ట్రంకురోడ్డులో బొల్లినేని హాస్పిటల్ ప్రక్క ఉన్న పోలీస్ క్వార్టర్ల స్థానంలో కొత్త పోలీసాఫీసు నిర్మాణానికి ప్రతిపాదనలు సిద్ధం చేశారు. ఈ మేరకు స్థలాన్ని 24వ తేదీ ఆర్థిక మంత్రి ఆనం రామనారాయణరెడ్డి ఎస్పీతో కలసి పరిశీలించారు. నెల్లూరు నగరంలో పోలీస్ క్వార్టర్లు బాగా దెబ్బతిని ఉండడం వల్ల కొత్తూరులోని ఐదెకరాల స్థలంలో వీటిని కట్టను ప్రతిపాదనలు సిద్ధం చేయమని ఆర్థిక మంత్రి ఎస్పీని కోరారు. నెల్లూరులో పోలీసాఫీసు కట్టి వందేళ్లు దాటింది. ఇక్కడే కొత్త ఆఫీసు కట్టేందుకు అనుకూలమైనా కొత్త స్థలాన్ని ఎందుకు అన్వేషించారో అర్థం కావడం లేదు.

## జిల్లా సహకారాధికారి బదలీ

జిల్లా సహకారాధికారి ఎస్వీఆర్ ఆనందబాబును ఆకస్మికంగా బదలీ చేశారు. జిల్లాలో సహకార ఎన్నికలు జరగను ఏర్పాట్లు జరుగుతున్న తరుణంలో కాస్త గట్టిగా వ్యవహరించే అలవాటున్న ఆనందబాబు ఉంటే ఇబ్బందులొస్తాయని తలచిన అధికార పార్టీ నాయకులు ఆయన్ను బదలీ చేయించారు.

## డిఎస్‌సి పుణ్యాన రెండు రోజుల కరెంట్!

విద్యుత్‌కోతలతో సతమతమవుతుండిన నెల్లూరీయులకు 26, 27 తేదీల్లో కోత లేకపోవడం కాస్త ఆశ్చర్యపర్చింది. దీనికి కారణం ఏమిటని ఆరాతీయగా ఉపాధ్యాయుల ఎంపిక కోసం నిర్వహించిన డిఎస్‌సి పరీక్ష అని తేలింది. ఉదయం, మధ్యాహ్నం పరీక్ష ఉండడంతో విద్యుత్ కోత విధిస్తే కొన్ని పరీక్షా కేంద్రాల్లో చిమ్మచీకట్లు కమ్ముతాయి. దీనిని దృష్టిలో ఉంచుకొని విద్యుత్ కోత లేకుండా చూశారట. ఆర్థిక మంత్రి రెండు రోజులు నెల్లూరులో ఉండడం వల్ల కోత విధించలేదని విషయం కొందరు తెలియని వాళ్లు వ్యాఖ్యానించడం వినిపించింది.

## రామనారాయణను లెక్కచేయని మేకపాటి!

జిల్లా సమీక్షా సమావేశంలో విచిత్ర సంఘటన చోటుచేసుకొంది. సమావేశానికి ముందుగానే వచ్చిన నెల్లూరు ఎమ్పీ మేకపాటి రాజమోహన్‌రెడ్డి తన స్థానంలో కూర్చొన్నారు. ఆర్థిక మంత్రి ఒకటిన్నర గంట లేటుగా సమావేశానికి వస్తూ మేకపాటి రాజమోహన్‌రెడ్డికి నమస్కరించారు. పాత గొడవలు మనసులో పెట్టుకొని కాబోలు మేకపాటి ఆయనకు ప్రతి నమస్కారం పెట్టలేదు. చూసీచూడనట్లు తలతిప్పుకొన్నారు. దీన్ని గమనించిన వివేకానందరెడ్డి ఇందిరమ్మ ఇళ్లపై చర్చ జరిగినప్పుడు మేకపాటిని 'కిండల్' చేస్తూ మాట్లాడి తన తమ్మునికి జరిగిన పరాభవానికి ప్రతీకారం తీర్చుకొన్నారు.

## జయప్రకాష్‌రెడ్డి అలెగ్జాండర్ నాటిక!

ఫ్యాక్షన్ సినిమాల్లో విలన్‌గా మంచి గుర్తింపు పొందిన జయప్రకాష్ రెడ్డి 7వ తేది కస్తూరిబా కళాక్షేత్రంలో అలెగ్జాండర్ నాటిక వేయనున్నారు. ఈ ఏక పాత్రాభినయ నాటికలో ఆయనొక్కడే వేదికపై కనిపిస్తారు. ఈ వయస్సులోనూ నాన్‌స్టాప్‌గా ఒక్కడే నటించడం సాహసం. తాను పదవతరగతి వరకు నెల్లూరులోనే చదువుకొన్నానని జయప్రకాష్‌రెడ్డి విలేకరులకు చెప్పడంతో అందరూ విని ఆశ్చర్యపోయారు. ఆ రోజుల్లో పేరుగాంచిన పోలీస్ అధికారి సాంబిరెడ్డి కొడుకే జయప్రకాష్‌రెడ్డి.

## వెంకయ్య సేవలో దినేష్‌రెడ్డి!

డిజిపి దినేష్‌రెడ్డి నెల్లూరు వచ్చారు. స్వంత పనుల నిమిత్తం స్వగ్రామం తాళ్ళపూడికి వెళ్లిన ఆయన తిరిగి హైదరాబాద్ వెళ్తూ గొలగమూడి వెంకయ్య స్వామిని ప్రత్యేకంగా అర్చించి వెళ్లడం విశేషం.

## ప్లేట్లు, గ్లాసుల పంపిణీ

రోటరీ క్లబ్ నెల్లూరు కార్యదర్శి కె.వి.సుబ్రహ్మణ్యం తన తల్లితండ్రులు కొణిజేటి సుబ్బారావు, రంగనాయకమ్మలు చేసిన ఆర్థిక సహాయంతో తలమంచి గ్రామంలోని వివిసి ప్రాథమికోన్నత పాఠశాలలోని 80 మంది విద్యార్థినీ విద్యార్థులకు ప్లేట్లు, గ్లాసులు పంపిణీ చేశారు. ఈ కార్యక్రమంలో క్లబ్ అధ్యక్షుడు కె.మధుసూధనరావు కూడా పాల్గొన్నారు.

## పేద గర్భిణులకు సీమంతం!

లయన్స్ క్లబ్ ఆఫ్ నెల్లూరు పినాకిని నేతృత్వంలో జూబ్లీ హాస్పిటల్‌లో పేద గర్భిణులకు సాంప్రదాయబద్ధంగా 24వ తేది సీమంతం కార్యక్రమం నిర్వహించారు. వీరికి చీరలు, సారె, పండ్లు పంపిణీ చేశారు. ఈ సందర్భంగా హాస్పిటల్ సూపరింటెండెంట్ డాక్టర్ లలితాశేఖర్ మాట్లాడుతూ మన సంస్కృతిలో భాగంగా జరిగే ఈ కార్యక్రమం వల్ల తల్లీ, బిడ్డా ఆనందంగా ఉంటారన్న ఆశాభావాన్ని వ్యక్తం చేశారు. క్లబ్ అధ్యక్షుడు చెవుల యుగంధర్, కోశాధికారి టి.వెంకటేశ్వర్లు, లయన్ లేడీస్ ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు.

## అంధకారంలో జిల్లా

జిల్లా ప్రజలు అంధకారంలో బతుకీడుస్తున్నారని జిల్లా ఇన్‌ఛార్జ్ మంత్రి పితాని సత్యనారాయణకు సిపిఎం పార్టీ వినతిపత్రం ఇచ్చి పరిస్థితులు చక్కదిద్దమని చెప్పింది. 25వ తేదీ జిల్లా సమీక్షా సమావేశానికి వచ్చిన మంత్రిని సిపిఎం జిల్లా కార్యదర్శి చంద్ర రాజగోపాల్, నగర కార్యదర్శి ఎం.మోహన్‌రావు కలసి జిల్లాలోని గ్రామాల్లో పగటిపూట విద్యుత్ ఉండడం లేదని, రాత్రిళ్లు నిత్యం విధిస్తున్న కోతతో గ్రామీణులు నిదురలేని రాత్రులు గడపవలసి వస్తుందని చెప్పుకొచ్చారు. విద్యుత్‌కోత వల్ల వ్యవసాయం, ఆక్వారైతులు, చిన్న పరిశ్రమలు, చిన్న వ్యాపారులు, గృహ వినియోగదారులు ఇబ్బంది పడుతున్నారని వివరించారు. విద్యుత్ కోతలను తగ్గించి ప్రజలను ఆదుకోవాలని మంత్రిని వీరు కోరారు.



నెల్లూరీయుడు, మెడినోవా మాజీ డైరెక్టర్, లెఫ్టినెంట్ కల్నల్ డాక్టర్ కె.భాస్కర్‌రెడ్డి వైద్యపరంగా చేసిన సేవలకుగాను హైదరాబాద్‌లోని త్యాగరాయ గానసభలో వంశీ ఆర్ట్స్ థియేటర్ తరపున సత్కరిస్తున్న డాక్టర్ సి.నారాయణరెడ్డి.

## మహమ్మద్ రఫీ మ్యూజికల్ నైట్

మధుర గాయకుడు మహమ్మద్ రఫీ వర్ధంతిని పురస్కరించుకొని గత 19 ఏళ్లుగా నెల్లూరులో జరుపుతున్న యాదే రఫీ మ్యూజికల్ నైట్ సెప్టెంబర్ 2వ తేది అనిల్ గార్డెన్స్‌లో జరుగుతుందని నిర్వాహకుడు జాకీర్ హుస్సేన్ చెప్పారు. ఆ రోజు సాయంత్రం 6.30 గంటలకు ప్రారంభమయ్యే ఈ కార్యక్రమంలో దుబాయ్ గాయకులు ఎల్లేషామ్, సిమ్రాన్ లతోపాటు రఫీ పాటలు పాడడంలో పేరుగాంచిన ఇబ్రహీం, కలీముల్లా, ఎస్ఎం బాషా, గౌస్‌బాషా, మహమ్మద్ అస్లాం, సుజాత, శిరీష, అమల ఈ గానలహరిలో పాల్గొంటారు. ఈ సందర్భంగా నటుడు నాగేంద్రబాబును సన్మానిస్తారు. రఫీ అభిమానులను ఈ కార్యక్రమానికి తరలి రమ్మంటున్నాడు నిర్వాహకుడు.

## చలమయ్యకు మదర్ థెరిస్సా అవార్డు!

రొటేరియన్ కె.వి.చలమయ్యకు మదర్ థెరిస్సా 102వ జయంతిని పురస్కరించుకొని 26వ తేది హైదరాబాద్‌లోని పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం ఆడిటోరియంలో హెల్త్‌కేర్ ఇంటర్నేషనల్ యూఎస్ఏ ఇండియా సంస్థ ఆధ్వర్యంలో మదర్ థెరిస్సా అవార్డు ప్రదానం చేశారు. ఆంధ్రప్రదేశ్ 20 సూత్రాల అమలు కమిటీ ఛైర్మన్ ఎన్.తులసిరెడ్డి, రాష్ట్ర మహిళా కాంగ్రెస్ అధ్యక్షురాలు శ్రీమతి గంగాభవాని, మాజీ మంత్రి కె.పుష్పలత, హైకోర్టు సీనియర్ న్యాయవాది ఎం.వెంకటేశ్వరి ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు.

## ఎన్ఎండి చారిటీస్ ఉచిత వైద్యం!

నెల్లూరు పెద్దబజారులోని ఎన్ఎండి చారిటీస్ నేతృత్వంలో 26వ తేది పిఎన్ఎం హైస్కూల్‌లో ఉచిత వైద్యశిబిరం జరిగింది. చర్మవ్యాధుల డాక్టర్ కె.ఎస్.రాజు 60 మంది రోగులను పరీక్షించి ఉచితంగా మందులు పంచిపెట్టారు. ఈ కార్యక్రమంలో సంస్థ నిర్వాహకుడు సయ్యద్ నిజాముద్దీన్, వైస్‌ఛైర్మన్ కె.శివారెడ్డి, సభ్యులు ఎ.రవిబాబు, షేక్ జహీర్, షేక్ అమర్, సయ్యద్ షంషుద్దీన్, మేనేజర్ ఖలీద్ కూడా పాల్గొన్నారు.

## అనాధకు అంతిమ సంస్కారం!

నెల్లూరు బారాషహీద్ దర్గా వద్ద బతుకీడుస్తూ ప్రాణాలు వదలిన తిరుపతి బాలాజీకాలనీకి చెందిన షేక్ హనీఫా (56)కు అంతిమ సంస్కార కార్యక్రమం చేయించి ఆదర్శంగా నిలిచింది హాజీ అబ్దుల్ అజీజ్ ట్రస్ట్. అంతిమ సంస్కారం నిర్వహించే వారు లేకపోవడంతో దర్గా ప్రాంతంలో ఉండేవారు అబ్దుల్ అజీజ్ ట్రస్ట్‌కు ఫోన్‌చేసి విషయం చెప్పగా ఇస్లాం సాంప్రదాయం ప్రకారం అన్ని కార్యక్రమాలు పూర్తిచేసి రంగనాయకులపేటలోని స్మశానవాటికలో ఖననం చేశారు. ఈ కార్యక్రమంలో అబ్దుల్ అజీజ్, ట్రస్ట్ సభ్యులు యజ్దాన్, డాక్టర్ అక్రమ్,

కొరవ 14వ పేజీలో

వజ్రం - బంగారం - వెండి
ఫ్యాక్టరి అవుట్‌లెట్
BIS 916 హాల్‌మార్క్
బంగారు ఆభరణములపై*
తరుగు 6% నుండి - కూలి లేదు.
వెండి వస్తువులపై*
తరుగులేదు - కూలిలేదు.
డైమండ్స్ పై 10% తగ్గింపు*
T&C Apply
గోల్డ్ ప్యాలెస్
ఆచారివీధి, హోటల్ శివం ఎదురుగా,
జిల్లా పరిషత్ ఆఫీస్ సెంటర్, నెల్లూరు.
ఫోన్: 2331133, 2327611

సిల్వర్ ఫ్యాక్టరి అవుట్‌లెట్
925 STERLING SILVER*
EXPORT QUALITY
వెండి వస్తువులపై*
తరుగు లేదు, కూలి లేదు.
*T&C Apply
సిల్వర్ ప్లాజా
EXCLUSIVE SILVER SHOW ROOM
(A Unit of Gold Palace)
ఆచారివీధి, హోటల్ శివం ఎదురుగా,
జిల్లా పరిషత్ ఆఫీస్ సెంటర్, నెల్లూరు.
ఫోన్: 2331132, 2331121

# నెల్లూరు నగరంలో భలే ఎస్‌ఐలు!



## లంచాలు తినడం మినహా పనితెలియని అసమర్ధులు!

నెల్లూరు నగరంలోని ఆరు పోలీస్‌స్టేషన్లలో ప్రస్తుతం పనిచేస్తున్న ఎస్‌ఐలు అనుభవశూన్యులు కావడం వల్ల స్టేషన్లలో నిత్య కార్యకలాపాలు సైతం మందగించాయి. దీంతో ఏదో ఒక అవసరమై స్టేషన్లకు వెళ్లే ప్రజలు నానా తిప్పలు పడాల్సి వస్తుంది. వన్‌టౌన్ ఎస్‌ఐ, సిక్స్త్ టౌన్ ఎస్‌ఐలు కానిస్టేబుల్ నుంచి ఎస్‌ఐ స్థాయికి ఎదిగినా ఈ స్టేషన్లలోని పని ఒత్తిడికి వాళ్లు చాలడం లేదు. టూటౌన్, త్రీ టౌన్, ఫోర్త్‌టౌన్, ఫిఫ్త్ టౌన్ ఎస్‌ఐలు చేతిలో డైరీ పట్టుకొని జీపుల్లో తిరగడం మినహా ఎఫ్‌ఐఆర్ సైతం నమోదుచేసే శక్తిలేని వ్యక్తులు. పూర్వం ఎస్‌ఐలుగా పనిచేసేవారు బుల్లెట్ వాహనాలపై తమ స్టేషన్ పరిధిలోని ప్రాంతాల్లో తిరిగేవారు. దీనివల్ల ఆయా ప్రాంతాల్లో శాంతిభద్రతలు అదుపులో ఉండేవి. ఇప్పుడు పనిచేస్తున్న ఎస్‌ఐల జీపులకు నెలసరి 70 లీటర్ల డీజిల్ పోస్తారు. స్టేషన్ పరిధిలోని ప్రాంతంలో తిరగను ఇది ఏమాత్రం సరిపోకపోవడం వల్ల పెట్రోల్ బంకుల వారిని ఉచితంగా డీజిల్ పోయమన్న దగ్గర నుంచి వీరి అవినీతి పర్వం మొదలు పెడుతున్నారు. బ్రాందీ షాపులు, బెల్ట్‌షాపులు, పేకాట క్లబ్బులు, వ్యభిచార గృహ నిర్వాహకుల నుంచి వచ్చే నెల మామూళ్లకు తోడు స్టేషన్లకు వచ్చే వివిధ మధ్యస్థాలు, కొట్లాట కేసులు నమోదుచేసే విషయంలో వచ్చే లంచాలతో జల్సాగా బతికేస్తున్నారు. వీరి స్టేషన్ల పరిధిలోని రౌడీషీటర్లు, చైన్‌స్నాచర్లు, జేబుదొంగలు, ఇళ్లలో దొంగతనాలు చేసే వ్యక్తుల గూర్చి వీరికి తెలియకపోవడం వల్ల నగరంలో దొంగతనాలు పెచ్చు పెరిగిపోయాయి. నగరంలో లా అండ్ ఆర్డర్ కూడా చెప్పుకోదగ్గ స్థాయిలో లేదు. నగరంలోని ఎస్‌ఐలు చురుగ్గా విధులు నిర్వహించేలా ఎస్పీ రమణకుమార్ వారికి దిశాదశ నిర్దేశం చేయాల్సిన అవసరం ఎంతైనా ఉంది.

# విద్య - వైద్యం - విజ్ఞానంపై శ్రద్ధ అవసరం!

## స్వర్ణభారత్ ట్రస్ట్‌లో వెంకయ్యనాయుడు!


శిబిరంలో మాట్లాడుతున్న వెంకయ్యనాయుడు.

కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు విద్య, వైద్యం, విజ్ఞానం పట్ల ప్రత్యేక దృష్టి సారించాలని బిజెపి జాతీయ నేత వెంకయ్యనాయుడు ఉద్భోదించారు. వెంకటాచలంలోని స్వర్ణభారత్ ట్రస్ట్, తిరుపతిలో బర్డ్ సంయుక్త నేతృత్వంలో జరిగిన అంగవైకల్యం, కీళ్లు, ఎముకల ఉచిత వైద్య శిబిరాన్ని ప్రారంభించి మాట్లాడారు. విద్య, వైద్యం, విజ్ఞానం పట్ల ప్రభుత్వాలు శ్రద్ధ చూపడం లేదు. బడ్జెట్‌లో నిధులు మంజూరు చేయకపోవడం వల్ల పేదలు వైద్యం చేయించుకోను ఇబ్బందులు పడాల్సి వస్తుందన్నారు. వివిధ కారణాల వల్ల కాళ్లు, చేతులు దెబ్బతిన్న వారితో పాటు కృత్రిమ అవయవాలు ఏర్పాటుచేసే తిరుపతిలోని బాలాజీ వికలాంగుల శస్త్ర చికిత్స పరిశోధనా మరియు పునరావాస సంస్థ(బర్డ్) చేస్తున్న సేవలు అమోఘమన్నారు. టిటిడి ఇఓ ఎల్వీ సుబ్రహ్మణ్యం మాట్లాడుతూ తిరుమల తిరుపతి దేవస్థానాల ఆధ్వర్యంలో దైవచింతన, ఆధ్యాత్మిక భావన పెంపొందించే కార్యక్రమాలతో పాటు విద్య, వైద్యపరమైన వివిధ సేవా కార్యక్రమాలను కూడా చేపడుతున్నట్లు చెప్పారు. ఈ శిబిరంలో 480 మందికి పరీక్షలు జరిపి అంగవైకల్యం గల 55 మందికి తిరుపతి బర్డ్‌లో శస్త్రచికిత్స చేయాలని తీర్మానించారు. బర్డ్ ఆసుపత్రి డైరక్టర్ డాక్టర్ జగదీష్, జిల్లా కలెక్టర్ శ్రీధర్‌రెడ్డి, స్వర్ణభారత్ మేనేజింగ్ ట్రస్టీ దీపా వెంకట్ ఈ కార్యక్రమాల్లో పాల్గొన్నారు.

# గబ్బురేపిన డిఇఓ!

## బదలీయే ఉత్తమం



డిఇఓకు వ్యతిరేకంగా నెల్లూరులో జరిగిన ర్యాలీ.

జిల్లా విద్యాశాఖాధికారి మువ్వా రామలింగం వ్యవహారశైలి మరోమారు వివాదాస్పదమైంది. ప్రభుత్వ నిబంధనలను తుంగలో తొక్కి తన ఇష్టానుసారంగా వ్యవహరిస్తూ ఉపాధ్యాయులను వేధింపులకు గురిచేస్తున్న డిఇఓను తక్షణం జిల్లా నుంచి బదలీ చేయాలని డిమాండ్ చేస్తూ పలు ఉపాధ్యాయ సంఘాలు నగరంలో భారీ ర్యాలీ నిర్వహించడంతోపాటు కలక్టరేట్ ఎదుట ధర్నా చేపట్టాయి. శాసన మండలి సభ్యులు విఠపు బాల సుబ్రహ్మణ్యం, శ్రీనివాసులురెడ్డి ఈ ఆందోళన కార్యక్రమానికి నాయకత్వం వహించి రామలింగంపై నిప్పులు చెరిగారు. విద్యాశాఖాధికారిగా బాధ్యతలు చేపట్టిన నాటి నుంచి రామలింగం వ్యవహరిస్తున్న తీరు వివాదాస్పదమౌతోంది. గతంలో ఉప విద్యాశాఖాధికారిగా పనిచేసిన సమయంలో తన మాట వినని, అక్రమాలకు పాల్పడని ఉపాధ్యాయులను పలురకాలుగా వేధిస్తుండేవాడు. కక్షపూరితంగా వ్యవహరిస్తూ చేయని తప్పులకు వారిని బలిచేస్తూ సస్పెండ్ చేయడం వివాదాస్పదమైంది. దీనికితోడు ఉపాధ్యాయుల సమావేశాల్లో డిఇఓ వాడే భాష, చేసే వ్యాఖ్యలు టీచర్లను బాధ పెడుతున్నాయి. ముఖ్యంగా మహిళా టీచర్లను ఉద్దేశించి వంకరగా మాట్లాడుతుండడంపట్ల మహిళలు కన్నీళ్లపర్యంతం అవుతున్నారు. కౌన్సిలింగ్‌లో గైడ్‌లైన్స్ ప్రకారం నడవకుండా ఇష్టానుసారంగా వ్యవహరించడం, క్లారిఫికేషన్ పేరుతో వేధించడం, ఏకపక్ష నిర్ణయాలతో ఉపాధ్యాయులు తీవ్ర ఇబ్బందులు పడ్డారు. నెల్లూరు, మనుబోలు, కావలి, పొదలకూరు తదితర ప్రాంతాల్లో బాలికలను బాలుర పాఠశాలకు వెళ్లి ఇంగ్లీషు మీడియం చదవమనడం తీవ్ర విమర్శలకు దారితీసింది. దీనిపై కలెక్టర్ ఆగ్రహం వ్యక్తం చేశారు. ఉపాధ్యాయ సంఘాల మధ్య చిచ్చుపెట్టి, కులాన్ని వాడుకొన్న తనకు అనుకూలంగా మద్దతు కూడగట్టడం, ఉపాధ్యాయులపై తప్పుడు కేసులు బనాయించడం, ఉన్నట్లుండి పదకొండు మంది మండల విద్యాశాఖాధికారులను బదలీ చేయడం తదితర చర్యలు దుమారం రేపుతున్నాయి. వీటిపై పలుమార్లు ఆయనతో ఉపాధ్యాయ సంఘాలు, శాసన మండలి సభ్యులు చర్చించినా పట్టించుకోకుండా నిర్లక్ష్యంగా వ్యవహరిస్తుండడంతో ఉపాధ్యాయ సంఘాలు డిఇఓకు వ్యతిరేకంగా ఆందోళన బాట పట్టాయి. మాకొద్దు ఈ వివాదాస్పద డిఇఓ అంటూ బ్యానర్లు చేతబట్టి నగరంలో భారీ ర్యాలీ నిర్వహించడం గతంలో విద్యాశాఖ చరిత్రలో ఎన్నడూ జరగలేదు. పలుమార్లు సస్పెండ్ అయినా, ఎసిబి చేతికి చిక్కినా, ఉన్నతాధికారుల నుంచి చీవాట్లు తిన్నా మువ్వా రామలింగంలో మాత్రం కించిత్ మార్పురాలేదని ఈ సంఘటనలు రుజువు చేస్తున్నాయి.

# ఎసి స్టేడియంలో పనిలేని కోచ్!

## రాజకీయ నాయకుల అండతో కొనసాగుతున్నాడు

విద్యార్థుల్లో క్రీడానైపుణ్యాన్ని పెంపొందించి వారిని ఉత్తమ క్రీడాకారులుగా తీర్చిదిద్దాల్సిన కోచ్‌ల వైఫల్యం, క్రీడల పట్ల ఆసక్తి సన్నగిల్లడం, అధికారులు పట్టించుకోకపోవడం వెరసి ఎసి స్టేడియంలో శిక్షణ కొరవడుతోంది. బాస్కెట్‌బాల్, తదితర క్రీడలకు తర్ఫీదునిచ్చేందుకు ప్రత్యేకంగా కోచ్‌లను ఏర్పాటు చేశారు. వీరికి వసతి సౌకర్యంతోపాటు వేలాది రూపాయలు జీతంగా చెల్లిస్తున్నారు. పిల్లలను చక్కని క్రీడాకారులుగా తీర్చిదిద్దాలన్న ఆశయం కోచ్‌లలో లేకపోవడం, పైరవీలు చేసుకొంటూ కులప్రాతిపదికన వర్గాలుగా ఏర్పడి, నేతల అండదండలతో ఎవరికి వారు పోట్లాడుకొంటుండడంతో ఎసి సుబ్బారెడ్డి స్టేడియం సమస్యలకు, వివాదాలకు నిలయంగా మారుతోంది. బాస్కెట్‌బాల్ క్రీడ కోసం ప్రత్యేకంగా కోచ్‌ను ఏర్పాటు చేసినప్పటికీ క్రీడాకారులు ఆసక్తి ప్రదర్శించకపోవడంతో కోచ్ తప్ప క్రీడాకారులు లేరు. దీంతో కోచ్ ఇండోర్ స్టేడియంలో పనిచేస్తూ ఇన్‌ఛార్జ్‌గా వ్యవహరించడం విమర్శల పాలవుతోంది. ఇండోర్ స్టేడియం నిర్వహణ ఇతరత్రా కార్యకలాపాలు చూసేందుకు బాస్కెట్‌బాల్ కోచ్‌ను ఏర్పాటు చేయడంపై పలువురు బహిరంగంగానే తప్పుపడుతున్నారు. ఈ కోచ్‌కు పని లేకపోయినా అది బయటపడకుండా ఉండేందుకు ప్రభుత్వ పాఠశాలల్లో టీచర్‌గా పనిచేస్తున్న వారి సహాయంతో ఆ పాఠశాల పిల్లలను తీసుకవచ్చి వారిని తూతూమంత్రంగా ఆటలాడించి తన పనైపోయిందని అనిపిస్తుంటాడు. చివరకు డిఎస్‌డిఓను సైతం లెక్కచేయకుండా అంతా తానై వ్యవహరిస్తుండడం, గ్రౌండ్‌కు తాళాలు వేసేస్తుండడం స్టేడియంలోని కోచ్‌లు, సిబ్బంది నిర్వాకాన్ని, ఉన్నతాధికారుల వైఫల్యాన్ని తెలియజేస్తోంది. మరోవైపు సాయంత్రం అయితే సిబ్బందిలో కొందరు అక్కడే కూర్చుని మద్యం సేవిస్తుండడంతో వాకింగ్‌కు, ఇతర క్రీడల కోసం అక్కడకు వచ్చే వారు తీవ్ర ఇబ్బందులు పడాల్సి వస్తోంది. ఇంత జరుగుతున్నా డిఎస్‌డిఓ పట్టించుకోకపోడం, దారి తప్పిన సిబ్బందిని గాడిలో పెట్టలేకపోవడంతో స్టేడియం కుల, వర్గ విబేధాలకు నిలయంగా మారుతోంది.

# మహానేతకు భాష్పాంజలి



పేదలపాలిట పెన్నిధి
పేద, మధ్యతరగతి ప్రజల శ్రేయస్సే ధ్యేయంగా
సంక్షేమ పథకాలు, పరిశ్రమలు పెట్టి
రాష్ట్రాన్ని అభివృద్ధి పథంలో నడిపించిన
**డాక్టర్ వై.ఎస్.రాజశేఖర్‌రెడ్డి గారు**
లేరని మేము ఊహించలేకున్నాము.
మీ వంటి ముఖ్యమంత్రి కలలోగానీ
ఇలలో గానీ ఇకరారు.
పదికోట్ల మంది గుండె చప్పుడు మీరు
భౌతికంగా మీరు మా మధ్యలేకున్నా...
ప్రజల హృదయాలలో చిరస్థాయిగా కొలువై వుంటారు.
**తృతీయ వర్ధంతి సందర్భంగా**
వారి పవిత్రాత్మకు శాంతిని చేకూర్చాలని
భగవంతుని ప్రార్థిస్తూ... శ్రద్ధాంజలి ఘటిస్తున్నాము.

**మేకపాటి రాజమోహన్‌రెడ్డి**
పార్లమెంటు సభ్యులు, నెల్లూరు.

**మేకపాటి చంద్రశేఖర్‌రెడ్డి**
శాసనసభ్యులు, ఉదయగిరి



విద్యుత్ కోతను నిరసిస్తూ కావలిలో కొవ్వొత్తుల ప్రదర్శనను నిర్వహిస్తున్న వైఎస్ఆర్ కాంగ్రెస్ నేత రామిరెడ్డి ప్రతాప్‌కుమార్‌రెడ్డి.



నెల్లూరు పొదలకూరు రోడ్డులో ఎన్‌బిఆర్ ఫ్రోజన్ ఫుడ్ సెంటర్‌ను ప్రారంభిస్తున్న మురళీకృష్ణ హోటల్ అధినేత వీరిశెట్టి హజరత్‌బాబు. ప్రక్కన బివి.నరసింహం, నలబోలు బలరామయ్య నాయుడు తదితరులు.

# వెంకటగిరి సమ్మర్ స్టోరేజ్ పనులు నాసిరకం!

## ఎమ్మెల్యే కురుగొండ్ల రామకృష్ణ ఆరోపణ



వెంకటగిరిలో 70కోట్లతో నిర్మిస్తున్న సమ్మర్ స్టోరేజ్ ట్యాంకు పనులు పరమ నాసిరకంగా వున్నాయని శాసనసభ్యుడు కురుగొండ్ల రామకృష్ణ ఆరోపించారు. గుడ్ల సముద్రం వద్ద నిర్మాణంలో వున్న ట్యాంకు పనులను ఆయన ఇటీవల పరిశీలించారు. కట్టకు వాడే మట్టి నాణ్యత లేదని, రివిట్‌మెంట్‌కు నాసిరకం రాళ్లు వాడుతున్నారని, పైపులైను నిర్మాణంపై గతంలోనే ఫిర్యాదు చేశామన్నారు. పనుల్లో మరింత జాప్యం జరుగుతున్నదన్నారు. అనంతరం మునిసిపల్ కార్యాలయంలో అధికారులతో సమీక్ష జరిపారు. గతంలో 35 లక్షల రూపాయలు పన్నుల రూపంలో వసూలవుతుండగా నేడు కోటికి పైగా రాబడి వస్తున్నదన్నారు. ఆదాయం పెరిగినా ప్రజల సౌకర్యాల కల్పనలోనూ, పారిశుధ్య నిర్వహణలోనూ వైఫల్యం చెందుతున్నారని అసంతృప్తి వ్యక్తం చేశారు. వీధి దీపాలు, పారిశుధ్యాన్ని మెరుగుపరచేందుకు చర్యలు చేపట్టాలన్నారు. దోమల నివారణకు ఫాగింగ్‌మిషన్‌ను కొనుగోలు చేయాలన్నారు. అక్టోబర్ 3, 4 తేదీలలో పోలేరమ్మ జాతర జరగనున్నందున ఎలాంటి లోపాలు జరగకుండా అన్ని ఏర్పాట్లు చేయాలని అధికారులకు సూచించారు. అదే రోజు మండలపరిషత్ కార్యాలయంలోను సమీక్షా సమావేశం నిర్వహించారు. ఆ సమయంలోనే ఫీజు రీఎంబర్స్‌మెంట్‌పై వినతిపత్రం ఇవ్వడానికి అక్కడకు వచ్చిన వైకాపా నేత పాపకన్ను రాజశేఖర్‌రెడ్డి గ్రీవెన్స్ డే నాడు సమీక్ష ఏంటంటూ ఎమ్మెల్యేతో వాగ్వివాదానికి దిగారు. దీనికి కురుగొండ్ల బదులిస్తూ ప్రజా విజ్ఞప్తులు స్వీకరిస్తునే అధికారులతో సమీక్షిస్తున్నామని చెప్పడంతో వివాదం సద్దుమణిగింది.

# కలువాయి వైకాపాలో సెగలు!

కలువాయి మండలం వైఎస్ఆర్ కాంగ్రెస్‌పార్టీలో విభేదాలు భగ్గుమంటున్నాయి. ఆ పార్టీ మండల కన్వీనర్‌గా దుంపా రామచంద్రారెడ్డికి బాధ్యతలు అప్పగించడంతో పలువురు బాహాటంగానే అసంతృప్తి వ్యక్తం చేస్తున్నారు. పార్టీ కోసం ఆరంభం నుంచి కలువాయిలో అన్నీతామై వ్యవహరిస్తున్న యువనేతలు, పంచాయితీ ఉప సర్పంచ్‌లు ఆ పార్టీ జిల్లా కన్వీనర్ కాకాణి గోవర్ధన్‌రెడ్డిపై కారాలు మిరియాలు నూరుతున్నారు. పదవులకు రాజీనామా చేసి వైఎస్ఆర్‌పార్టీ జెండా భుజాన మోస్తుంటే మండల ప్రజలతో ఏమాత్రం సంబంధం లేని వ్యక్తిని, మండల కేంద్రానికి 30కిమీ దూరంలో ముంపు ప్రాంతంలో వుండే వ్యక్తిని తీసుకవచ్చి మండల బాధ్యతలు అప్పగించడంపై భగ్గుమంటున్నారు. మండలంలోని కార్యకర్తలు,

### కాకాణి ఎలా చల్లార్చుతారో?

ప్రజల అభిప్రాయాలను పరిగణలోనికి తీసుకోకుండా కాకాణి సన్నిహితులైన కలువాయి కాంగ్రెస్‌నేత సూచన మేరకే దుంపాకు బాధ్యతలు కట్టబెట్టారని వాపోతున్నారు. నిజానికి దుంపా రామచంద్రారెడ్డి కాంగ్రెస్‌పార్టీ కోవర్టని, అలాంటి వ్యక్తికి మండలపార్టీ బాధ్యతలు అప్పగిస్తే ఆయన కాంగ్రెస్ నేతల ఇంటికి వెళ్లి వారిని తన వాహనంలో ఎక్కించుకొని తిరుగుతున్నారని ఆరోపిస్తున్నారు. జిల్లా కన్వీనర్ ఇప్పటికైనా స్పందించి వైఎస్ అభిమానుల అభిప్రాయాలను గుర్తించి ప్రజలతో సత్సంబంధాలు, పోరాట పటిమ గల వ్యక్తికి మండల బాధ్యతలు అప్పగించాలని కోరుతున్నారు.

● గూడూరులో

# దొంగలు బాబోయ్ దొంగలు!

గత రెండు నెలలుగా దొంగతనాలు అధికం కావడంతో గూడూరు పట్టణ ప్రజలు హడలిపోతున్నారు. ఎప్పుడు ఎవరింట్లో దొంగతనం జరుగుతుందో, ఎవరి నగలు దోచుక వెళతారోనని కంటిమీద కునుకు లేకుండా జీవిస్తున్నారు. పగలు రాత్రి అనే తేడా లేకుండా, తాళం వేసిన ఇళ్లు, తాళం వేయని ఇళ్లు అనే భేదం లేకుండా దొంగలుపడి దోచుకపోతుండడంతో పట్టణంలో దొంగల భయం ఏర్పడింది. ఇక రోడ్డుపై వెళ్తున్న మహిళల మెడలలో నగలు దోచుకెళ్లడం అధికంగా జరుగుతుండడంతో ప్రజలకు భద్రత కరువైంది. గూడూరు దొంగల రాజ్యంగా మారినా, ప్రజలు భయభ్రాంతులకు గురౌతున్నా పోలీసులు వాటిని అరి కట్టడంలో విఫలమౌతుండడంతో దొంగతనాలు జోరందుకొన్నాయి. పట్టణంలోని బాలాజీ నగర్‌లో ఒక ఇంట్లో కిటీకీ కమ్ములను తొలగించి లోనికి ప్రవేశించి ఇంట్లో వున్న నగలు, నగదు తస్కరించారు. అదే వారంలో మిట్టపాళెంలో గల మరో ఇంట్లోకి ప్రవేశించి అలాగే దొంగతనానికి పాల్పడ్డారు. అలాగే రోడ్డుపై వెళ్తున్న మహిళ మెడలో నుంచి ఏడు సవర్ల బంగారు నగను బైక్‌పై వచ్చిన దొంగ లాక్కెళ్లాడు. ఇలాంటి ఘటనలతో ప్రజల్లో భయాందోళనలు వ్యక్తం అవుతున్నాయి. రాత్రి పూట గస్తీ కొరవడడం, నేరస్తులపై నిఘా లోపం ఫలితంగా దొంగతనాలు అధికం అవుతున్నాయన్న విమర్శలు వ్యక్తం అవుతున్నాయి.

**కంటి మీద కునుకులేని జనం**

జమీన్‌రైతు
పొగతోట, నెల్లూరు - 524 001.
ప్రకటనలకు
98489 66163
98489 66165
చందాలకు
98489 66190

● పత్తి రైతులను

# దగా చేస్తున్న దళారులు!

ఆరుగాలం శ్రమిస్తున్న రైతులు గిట్టుబాటు ధర లభించక ఒకవైపు, దళారుల కబంధహస్తాల్లో చిక్కుకొని, నకిలీలతో అన్ని విధాల తీవ్రంగా నష్టపోతున్నారు. అప్పోసొప్పో చేసి పండించిన పంట అమ్ముకోవాలన్నా అడ్డ కాటాలతో దళారులు నిలువునా దోచుకొంటున్నారు. కావలి చుట్టు ప్రక్కల ప్రాంతాల్లో దళారులు రంగప్రవేశం చేసి రైతులను దగా చేస్తున్నారు. ముఖ్యంగా పత్తి పండించిన రైతాంగం వీరి చేతుల్లో చిక్కుకొని విలవిల్లాడుతోంది. రైతులు పండించిన పత్తిని కొనుగోలు చేసేందుకు వచ్చే దళారులు తమ చేతివాటం

### కావలిలో కుయ్యోమొర్రో అంటున్న రైతులు

ప్రదర్శిస్తున్నారు. ఒక క్వింటాల్ పత్తికి కనీసం 10 కేజీల పత్తిని దోచుకొంటున్నారు. ఒక్క ఎకరాకు షుమారు 7 నుంచి 13 క్వింటాళ్ల దిగుబడి వస్తుంది. ఎకరాకు కనీసం రైతు ఏడు క్వింటాళ్ల పత్తి పండించి అమ్ముకొంటే దళారుల వలన 70కేజీలు నష్టపోవాల్సి వస్తోంది. ఇదేమని ప్రశ్నిస్తే ఇష్టం వుంటే ఇవ్వండి లేదంటే కొనమంటూ దబాయిస్తున్నారట. దళారులంతా ఒక సిండికేటుగా ఏర్పడడంతో వేరే వారికి అమ్ముకోలేక దళారులు చెప్పిన రేటుకు, వారు కోరిన విధంగా అమ్ముకోవాల్సి వస్తుండడంతో రైతులు తీవ్రంగా నష్టపోతున్నారు.

# జక్కేపల్లిగూడూరు రోడ్లు ధ్వంసం!

## ఇబ్బందిపడుతున్న జనం

బోగోలు మండలం జక్కేపల్లి గూడూరులో రోడ్లు పూర్తిగా ధ్వంసమైపోయాయి. అసలే అంతంత మాత్రంగా వున్న రోడ్లు మూడు, నాలుగేళ్ల క్రిందట వచ్చిన లైలా తుఫాన్, జల్ తుఫాన్‌ల కారణంగా పూర్తిగా దెబ్బతిని రూపురేఖలు కోల్పోయాయి. గుంటలు పడిపోవడంతో ఈ మార్గం గుండా ప్రయాణించాలంటేనే వాహనాలపై వెళ్లే వారు హడలిపోతున్నారు. అందులో రాత్రి సమయాల్లో అయితే రోడ్లపై వున్న గుంటలు కన్పించక ప్రమాదాలకు గురౌతున్నారు. ఇక వర్షం వచ్చిందంటే రోడ్డంతా నీటితో నిండి చెరువును తలపిస్తుంటుంది. ఈ గ్రామస్తులు బయటి ప్రాంతాలకు రాకపోకలు సాగించేందుకు రెండు బస్సులను నడుపుతుంది ఆర్టీసి. ఎండాకాలంలో మాత్రం తిరిగే ఈ బస్సులు వర్షం వచ్చిందంటే ఊర్లోకిపోయేందుకు అవకాశం లేక బస్సులు నిలిపి వేస్తుండడంతో ఆ గ్రామానికి బయటి ప్రపంచానికి సంబంధాలు తెగిపోతున్నాయి. విద్యార్థులు ఈ కారణంగా చదువులకు ఆటంకం ఏర్పడుతోందని వాపోతున్నారు. ఇప్పటికైనా అధికారులు స్పందించి రోడ్డు మరమ్మత్తులు చేపట్టాలని గ్రామస్థులు కోరుతున్నారు.

## పొదుపు గ్రూపులకు రుణాలు

### మరింత సాయం చేస్తానన్న ఎమ్మెల్యే ఆదాల

సర్వేపల్లి నియోజకవర్గాన్ని అన్ని విధాలా అభివృద్ధి పథంలో నడిపేందుకు శాయశక్తులా కృషి చేస్తానని శాసనసభ్యుడు ఆదాల ప్రభాకర్‌రెడ్డి తెలిపారు. ఇటీవల తోటపల్లిగూడూరు మండలం కోడూరులో సిండికేట్ బ్యాంకు ద్వారా పొదుపు గ్రూపులకు రుణాలను అందజేశారు. మండల పరిషత్ కార్యాలయంలో జరిగిన కార్యక్రమంలో సమీకృత కార్యాచరణ పథకాల అమలులో భాగంగా ఇందిరక్రాంతి పథకం ద్వారా కోటి రూపాయల చెక్‌ను పొదుపు గ్రూపులకు అందజేశారు. ఆయన మాట్లాడుతూ నియోజకవర్గ అభివృద్ధికి విశేష కృషి చేస్తున్నామన్నారు. కోడూరు చెరువు ఆధునీకరణ పనులు చేపట్టడం వలన రైతుల సాగునీటి కొరత తీరుతుందన్నారు. ఈ కార్యక్రమంలో స్పెషల్ ఆఫీసర్ రవిచంద్రప్రసాద్, ఎమ్పీడీఓ సావిత్రమ్మ, తహశీల్దార్ రేవతి, ఐటిడిఏ పిఓ వెంకటేశ్వర్లు, మండల కాంగ్రెస్ అధ్యక్షుడు దిలీప్‌రెడ్డి, జాఫర్ సాహెబ్ కెనాల్ కమిటీ ఛైర్మన్ దువ్వూరి సురేంద్రనాథ్‌రెడ్డి, కాంగ్రెస్ నేతలు కామిరెడ్డి చంద్రశేఖర్‌రెడ్డి, పెదబాబిరెడ్డి, తూపిలి సుబ్బారెడ్డి, దశరథరామరెడ్డి, కృష్ణవేణిలు పాల్గొన్నారు.

## భోజన వివాదం!

మెస్ నిర్వహణ సక్రమంగా లేదని, నాసిరకంగా భోజనాలు పెడుతున్నారంటూ కావలి పిజి సెంటర్ విద్యార్థులు ఆందోళనకు దిగారు. నాసిరకం బియ్యంతో భోజనం పెడుతూ బిల్లులు మాత్రం దండిగా వసూలు చేస్తున్నారని విద్యార్థులు వాపోతున్నారు. నాణ్యత లేని సరుకులు తెచ్చి ఆహారాన్ని తయారు చేయడం వల్ల తిన లేకపోతున్నామన్నారు. చివరకు భోజనంలో పురుగులు వుంటున్నాయని ఈ విషయాన్ని పలుమార్లు సంబంధిత అధికారులకు

### మళ్లీ వార్తల్లో పిజి సెంటర్

తెలియజేసినా పట్టించుకోలేదన్నారు. దీనిని నిరసిస్తూ తరగతులు బహిష్కరించి ధర్నాకు దిగారు విద్యార్థులు. ఈ సమయంలో యాజమాన్యానికి మద్దతుగా మరొక వర్గం విద్యార్థులు రంగప్రవేశం చేయడంతో ఉద్రిక్తత నెలకొంది. సమాచారం అందుకొన్న పోలీసులు వచ్చి పరిస్థితిని అదుపు చేశారు. ఈ సందర్భంగా ఆందోళన చేస్తున్న విద్యార్థులు యాజమాన్యమే వారికి అనుకూలంగా వున్న వారిని రెచ్చగొట్టడం, పోలీసులను పిలిపించడం చేస్తున్నారని ఆరోపించారు.

● రైతు క్లబ్బులకు

## నాబార్డు సాయం!

### రైతుల ఆర్థికాభివృద్ధే లక్ష్యం

రైతు క్లబ్బుల ద్వారా రైతుల జీవనోపాధిని మెరుగుపరచేందుకు, వివిధ అంశాలపై శిక్షణ నిచ్చేందుకు చర్యలు తీసుకొంటున్నట్లు నవజీవన్ స్వచ్ఛంద సంస్థ డైరెక్టర్ సహదేవయ్య తెలిపారు. సంస్థ ఆధ్వర్యంలో దక్కిలి మండలం లింగసముద్రంలో ఏడు గ్రామాలకు చెందిన రైతులకు రైతు క్లబ్బులపై శిక్షణా కార్యక్రమాన్ని నిర్వహించారు. ఈ సందర్భంగా ఆయన మాట్లాడుతూ రైతులను ఆర్థికంగా వృద్ధి చేసేందుకు నాబార్డు సహకారం అందిస్తున్నదన్నారు. రైతులు వ్యవసాయంలో ఆధునిక, సాంకేతిక పద్ధతులను పాటిస్తేనే ప్రయోజనం వుంటుందన్నారు. ఆరు లక్షల రూపాయల రుణంతో రైతు క్లబ్బులకు 150గేదెలను నాబార్డు మంజూరు చేసిందన్నారు. మహిళా డైరెక్టర్ విక్టోరియా మాట్లాడుతూ రైతుక్లబ్‌లోని సభ్యులు ఐదు మంది వంతున పొదుపు సంఘాలను ఏర్పాటు చేసుకోవాలన్నారు. మహిళలకు చీరల ప్రింటింగ్‌పై ఉచిత శిక్షణ ఇవ్వడానికి నాబార్డు అంగీకరించిందన్నారు. ఈ శిక్షణా కార్యక్రమాల్లో పలువురు రైతులు పాల్గొన్నారు.

## విద్యుత్ బకాయిలు 62కోట్లు!

జిల్లాలో 62కోట్ల రూపాయల విద్యుత్ బకాయిలు పేరుకొనిపోయి వున్నాయని ఆశాఖ ఎస్ఇ నందకుమార్ తెలిపారు. ఇలాగే కొనసాగితే ప్రభుత్వ కార్యాలయాలు, వైద్యశాలలు, హాస్టళ్లు, రక్షిత మంచినీటి పథకాలకు మాత్రం మినహాయింపునిచ్చి బకాయిలు రావాల్సిన మిగిలిన శాఖలకు విద్యుత్ సరఫరా నిలిపివేస్తామన్నారు. ఆత్మకూరు డివిజన్‌లో 5కోట్లరూపాయలు, పంచాయితీ నుంచి 2.5కోట్లు, వ్యవసాయ రంగం ద్వారా 70లక్షల రూపాయలు వసూలు రావాల్సి వుందన్నారు. అక్రమ విద్యుత్ వాడకాన్ని అరికట్టేందుకు హెచ్‌విడిసి సిస్టంను ఏర్పాటు చేస్తున్నట్లు తెలిపారు. ఇటీవల ఆత్మకూరు వచ్చి ఆయన డిఇ కార్యాలయంలోని రికార్డులను పరిశీలించారు. మర్రిపాడు, డిసిపల్లి, కృష్ణాపురం, కాతిగుంట గ్రామాలకు హైపవర్ డిస్ట్రిబ్యూటరి సిస్టం ద్వారా నాణ్యమైన విద్యుత్‌ను సరఫరా చేస్తామన్నారు.

**ట్రాన్స్‌కో ఎస్ఇ వెల్లడి**

## ఇష్టమొచ్చినట్లుగా విద్యుత్ బిల్లుల రీడింగ్

అసలే విద్యుత్ బిల్లులు వినియోగదారులను గాబరా పరుస్తున్న పరిస్థితుల్లో సిబ్బంది సక్రమంగా రీడింగ్ తీయని కారణంగా అధికమొత్తంలో బిల్లు చెల్లించాల్సివస్తోందని వాపోతున్నారు ముత్తుకూరు మండల ప్రజలు. వినియోగదారుల విద్యుత్ వాడకాన్ని ప్రతినెలా నాల్గవ తేదీన రీడింగ్ తీసి ఇవ్వాల్సి వుంది. అయితే మీటర్ రీడింగ్ చూసి బిల్లులు ఇవ్వడంలో తీవ్ర జాప్యం జరుగుతుండడంతో శ్లాబ్ మారిపోయి అధిక భారం మీద పడుతున్నదని మండలంలోని పలు ప్రాంతాల ప్రజలు ఆరోపిస్తున్నారు. 50 యూనిట్ల వరకు ఒక రేటు, ఆపైన యూనిట్లను బట్టి బిల్లు మారిపోతుంటుంది. గడువులోపల రీడింగ్ తీయకుండా ఆలస్యంగా తీయడం వలన పరిమితంగా విద్యుత్ వాడుతున్న వినియోగదారులు సైతం సిబ్బంది నిర్వాకం వలన అధిక మొత్తంలో బిల్లు చెల్లించాల్సి వస్తోందని వాపోతున్నారు.

## గూడూరును అభివృద్ధి చేస్తా! 

**ఆర్థికమంత్రి వాగ్దానం**

గూడూరు పట్టణాన్ని మరింతగా అభివృద్ధి చేసేందుకు కృషి చేస్తామని ఆర్థిక మంత్రి ఆనం రామనారాయణరెడ్డి తెలిపారు. ఇటీవల ఆయన గూడూరు మండలంతోపాటు, పట్టణ పరిధిలో జరిగిన పలు అభివృద్ధి కార్యక్రమాలు, శంకుస్థాపనలకు హాజరయ్యారు. ఆయన మాట్లాడుతూ గూడూరుకు ఇప్పటివరకు ఎన్నో అభివృద్ధి పనులు చేశామన్నారు. కొందరు నేతలకు పనులు చేయడం చేతగాక, చేసేవారిని విమర్శిస్తున్నారని స్థానిక ఎమ్మెల్యే బల్లిని ఉద్దేశించి పరోక్ష విమర్శలు చేశారు. ఇక్కడి అభివృద్ధి పనులకు 60కోట్లు కావాలని నియోజకవర్గ ఇన్‌చార్జి పనబాక కృష్ణయ్య అడిగారన్నారు. పురపాలక సంఘ అభివృద్ధికి 15 కోట్ల రూపాయలు ఇచ్చామన్నారు. జిల్లాలో చెరకు రైతులకు ఇవ్వాల్సిన బకాయిలను 11.5 కోట్ల రూపాయలను చెల్లించే బాధ్యత తనదేనని, వాటిని రెండు వారాల్లో అందిస్తామన్నారు. ఈ సందర్భంగా పలువురు రైతులు చెరువులకు నీరు చేరక పంటలు ఎండిపోతున్నాయని మంత్రి దృష్టికి తీసుకొని వచ్చారు. ఈ కార్యక్రమంలో పనబాక కృష్ణయ్య, మెప్మా పిడి కమలకుమారి, ఎంపిడిఓ నిర్మలాదేవి, కమిషనర్ సుశీలమ్మ, మాజీ ఎమ్మెల్యేలు ఎల్లసిరి శ్రీనివాసులరెడ్డి, సివి శేషారెడ్డి, చేవూరి దేవకుమార్‌రెడ్డి, నల్లపరెడ్డి జగన్మోహన్‌రెడ్డి తదితరులు పాల్గొన్నారు.

NIPPO

BATTERIES TORCHES

Get more out of Life







Technology from MATSUSHITA ELECTRIC Japan.

# శంకరమఠం శతజయంతోత్సవాలు!

## వెంకటగిరిలో ఘనంగా జరిగాయి

వెంకటగిరిలో గల శంకర మఠం శతవర్ష జయంతోత్సవాలు ఘనంగా జరిగాయి. ఈ ఉత్సవా లను పురస్కరించుకొని స్థానిక కర్ణకమ్మవీధిలో గల మఠంలో పలు కార్యక్రమాలను ఆగష్టు 16న నిర్వ హించారు. ప్రముఖ ఆధ్యాత్మిక ఉపన్యాసకులు చాగంటి కోటేశ్వరరావు శంకర విజయంపై అనర్గ ళంగా, అవిశ్రాంతంగా తన వాక్పటిమతో శ్రోతలను ఆకట్టుకొన్నాడు. భారతావనిలో జాతీయ సమైక్యతను మొదటగా బోధించిన వారు జగద్గురు ఆదిశంకరా చార్యులన్నారు. కొన్ని గంటలపాటు ధారాపాతంగా సాగిన ఆయన ఉపన్యాసాన్ని ప్రజలు ఆసాంతం కద లకుండా విన్నారు. శంకరమఠం నిర్వాహకులు డాక్టర్ బి. సూర్యనారాయణ ప్రసంగిస్తూ ఇక్కడి శం కర మఠంలో కంచి పీఠాధిపతులు పలుమార్లు బస చేశారన్నారు. స్థానిక రాజ కుటుంబీకుడు సాయికృష్ణ యాచేంద్ర, ఎస్‌విబిసి ఛానల్ సిఎల్ఓ వెంకటశర్మ, టిటిడి డిప్యూటి ఇఓ ఉమాపతిరెడ్డి, హిందూ ధర్మ ప్రచార సమితి కార్యదర్శి ఆచార్య కసిరెడ్డి వెంకట రెడ్డి, జిల్లా కోఆర్డినేటర్ శ్రీహరి తదితరులు పాల్గొన్న ఈ కార్యక్రమంలో తిరుపతి సంగీత కళాశాల ప్రధా నాచారిణి నల్లా ప్రభావతి బృందం వయొలిన్‌పై వెంకటేశ్వరస్వామి భక్తిగీతాలను ఆలపించారు.

# సహకార సంఘ భవనానికి శంకుస్థాపన!

## ఆదాల చేతులమీదుగా కార్యక్రమం

తోటపల్లిగూడూరు మండలంలోని వరిగొండ గ్రామంలో సహకార పరపతి సంఘ భవన నిర్మా ణానికి స్థానిక శాసన సభ్యుడు ఆదాల ప్రభాకర్‌రెడ్డి ఇటీవల భూమిపూజ చేశారు. స్థానికంగా ప్రజల్లో మంచి పట్టుగల నేతగా పేరొందిన చినబాబిరెడ్డి ఆహ్వానంపై ఇక్కడకు వచ్చిన ఎమ్మెల్యే ప్రభాకర్‌రెడ్డి ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు. అలాగే ఆదాల ట్రస్టు, ఐటిడిఏ ద్వారా ఏర్పాటుచేసిన కుట్టుమిషన్ కేంద్రాన్ని ఆయన ప్రారంభించారు. ఈ కార్యక్ర మంలో సహకారశాఖ డిఎం కెవి.రమణారెడ్డి, నీటి సంఘంనేత చంద్రశేఖర్‌రెడ్డి పలువురు రైతులు పాల్గొన్నారు.

# తెలుగుదేశం పుట్టుక చారిత్రాత్మకం!

**● సర్వాయపాలెంలో జరిగిన కార్యకర్తల సభలో గన్నవరం ఎమ్మెల్యే**

తెలుగుదేశం పార్టీ పుట్టుకే చారిత్రాత్మకమని కృష్ణాజిల్లా గన్నవరం ఎమ్మెల్యే బాలవర్ధన్‌రావు అన్నారు. కావలి రూరల్ మండలం సర్వాయపా ళెంలో పార్టీ సంస్థాగత ఎన్నికల్లో భాగంగా జరిగిన కార్యక్రమంలో ఆయన ముఖ్యఅతిధిగా పాల్గొ న్నారు. సినీ రంగంలో రారాజుగా వెలుగొందుతూ పేదల కష్టాలు తీర్చడానికి ఎన్‌టిఆర్ పార్టీని స్థాపించి 9నెలల కాలంలోనే అధికారంలోకి వచ్చా రన్నారు. రాష్ట్రంలో అభివృద్ధి సంక్షేమ పథకాల వలన పేదలకు లబ్ధి కల్గింది తెలుగుదేశం హయాం లోనేనన్నారు. చంద్రబాబునాయుడు రాష్ట్రాన్ని అన్ని విధాలా అభివృద్ధి చేశారన్నారు. కావలి ఎమ్మెల్యే బీద మస్తాన్‌రావు మాట్లాడుతూ పార్లమెంటు ఉప ఎన్నికల్లో పార్టీకి వెన్నుపోటు పొడిచిన వారు పార్టీ వదిలిపోవచ్చన్నారు. ప్రజా సమస్యలపై నిరంతరం పోరాటం చేయాలని, ప్రజల పక్షాన నిలబడాలని తెలుగుయువత రాష్ట్ర అధ్యక్షుడు బీద రవిచంద్ర పిలుపునిచ్చారు. ఈ కార్యక్రమంలో రంగారావు, రాంప్రసాద్, రవికుమార్‌రెడ్డి తదితరులు పాల్గొ న్నారు.

# నాటకాలంటే ప్రాణం!

నాటకాలంటే ప్రాణమని వాటికోసం అవసర మైతే సినిమాలను వదులుకొంటానని ప్రముఖ సినీ నటుడు జయప్రకాష్‌రెడ్డి తెలిపారు. ఇటీవల ఆయన కావలి పట్టణంలో జరిగిన ఒక కార్యక్రమానికి విచ్చే యగా ప్రముఖ వ్యాపారులు అమరా సోదరులుగా పేరు గడించిన సుబ్బారావు, యాదగిరి గుప్తలు ఘనంగా సన్మానించారు. ఈ సందర్భంగా జయ ప్రకాష్‌రెడ్డి మాట్లాడారు. నెల్లూరు జిల్లాతో విడదీ యరాని బంధం వుందన్నారు. తండ్రి సాంబిరెడ్డి నెల్లూరులో పోలీస్ డిపార్టుమెంట్‌లో సిఐగా పని చేశారని తెలిపారు. ఆనాటి నుంచి జిల్లాతో అను బంధం వుందన్నారు. నాటకాల వలనే తాను ఈ స్థాయికి వచ్చానని చెప్పారు. నాటకాలు సమా జానికి దగ్గరగా వుంటాయని, మానవ, కుటుంబ



సంబంధాలు చక్కగా కన్పడతాయన్నారు. ఇప్పటికే వారంలో రెండురోజులు నాటకాలకే కేటాయిస్తున్నా నని తెలిపారు.

# కావలి సబ్‌స్టేషన్‌ను ముట్టడించిన ఎమ్మెల్యే!

**● విద్యుత్ కోతలను నిరసిస్తూ ఆరు గంటల ధర్నాలో బీద**

వేళాపాళా లేకుండా విద్యుత్ కోతలు విధించ డంపై ఆగ్రహించిన కావలి శాసనసభ్యుడు బీద మస్తాన్‌రావు సబ్‌స్టేషన్‌ను ముట్టడించి బైఠాయించ డంతో ఉద్రిక్తత నెలకొనింది. గత కొంతకాలంగా ఎడా పెడా విద్యుత్ కోతలు విధిస్తుండడంతో ప్రజలు తీవ్రంగా ఇబ్బంది పడుతున్నారు. పలు ప్రాంతాల ప్రజలు ఈ విషయమై ఎమ్మెల్యేకు ఫిర్యాదు చేయ డంతో ఇటీవల ఆయన వున్నట్లుండి కావలి సబ్ స్టేష న్‌ను అనుచరులతో కలిసి ముట్టడించారు. అధికా రుల తీరును నిరసిస్తూ షుమారు ఆరుగంటలపాటు, అక్కడ నుంచి కదలకపోవడంతో వాతావరణం వేడె క్కింది. ఎమ్మెల్యే సబ్‌స్టేషన్‌ను ముట్టడించేందుకు వస్తున్న విషయాన్ని ముందుగానే తెలుసుకొన్న అధికా రులు సబ్‌స్టేషన్‌కు తాళాలు వేశారు. అక్కడకు చేరు కొన్న ఆయన ఎంత సేపయినా తలుపులు తీయకపోవ డంతో స్వయంగా వాటిని తెరచి లోనికి ప్రవేశించ డంతో అధికారులు హడలిపోయారు. అక్కడ వున్న డిఇని కోతలపై ప్రశ్నించడంతో ఆయన సమాధానం చెప్పలేక నీళ్లు నమలడంతో ఎమ్మెల్యే ఆగ్రహం వ్యక్తం చేశారు. ఇష్టప్రకారం కోతలు విధిస్తుండడం వలన ప్రజలు తీవ్రంగా ఇబ్బంది పడుతున్నారన్నారు. చివరకు ఎస్ఇ ఫోన్‌లో మాట్లాడి నిర్దిష్ట సమయంలో మాత్రమే విద్యుత్ కోత విధిస్తామని హామీ ఇవ్వడంతో ఆందోళన విరమించారు. ఈ కార్యక్రమంలో టిడిపి నాయకులు మలిశెట్టి వెంకటేశ్వర్లు, నాయుడు రాంప్రసాద్, బీద గిరిధర్, రవీంద్రబాబు, కిషోర్, వేణు, నాగరాజు, ఖలీల్ తదితరులు పాల్గొన్నారు.

# ఎసిబి వలలో చేజర్ల ఎస్ఐ!

## గతమంతా అవినీతి చరిత్రే!



కిడ్నాప్ కేసుకు సంబంధించి లంచం తీసుకొంటూ చేజర్ల ఎస్ఐ రమేష్‌బాబు, కానిస్టేబుల్ గురవయ్య ఎసిబి అధికారులకు దొరికిపోయారు. నిందితులపై నేరతీవ్రత తగ్గించి బెయిల్ దొరికేలా చేయాలంటే డబ్బులివ్వాలని డిమాండ్ చేయడంతో వారు ఎసిబిని ఆశ్రయించారు. వారి పథకం ప్రకారం ఎస్ఐకు ఆ మొత్తం ఇవ్వ బోగా కానిస్టేబుల్ గురవయ్యకు ఇవ్వమని చెప్పారు. ఆయన ఆ డబ్బును తీసుకొంటుండగా ఎసిబి అధికారులు వలపన్ని పట్టుకొ న్నారు. ఎస్ఐ చెప్తేనే తాను ఆ మొత్తాన్ని తీసుకొన్నానని కానిస్టే బుల్ చెప్పడంతో ఇద్దరిపై కేసు నమోదు చేసి కోర్టుకు పెట్టారు. ఈ ఘటన జరిగిన తర్వాత ఎస్ఐ అవినీతి అక్రమాలు వెలుగు చూస్తున్నాయి. స్టేషన్లో సివిల్ పంచాయితీలు చేయడంలో దిట్టట. ఇరువైపులా డబ్బులు గుంజి రాజీ చేయడం, ఎర్రచందనం స్మగ్లర్లతో నెల కమీషన్ల బేరం కుదుర్చుకొని లక్షలు సంపాదించినట్లు ఆరోపణలున్నాయి. మహిళలను వేధింపులకు గురి చేసిన ఫిర్యాదులున్నాయి. గతంలో గుంటూరుజిల్లాలో పని చేసిన సమయంలోనూ అవినీతి, మహిళా వేధింపులతో సస్పెండ్ అయినట్లు సమాచారం. మొత్తం మీద చేజర్ల పోలీస్‌స్టేషన్‌పై ఎసిబి దాడితో పోలీసుల్లో వణుకు పుట్టింది.

# ఇందిరమ్మ ఇళ్లకు ఇసుక కూపన్లు!

ఇందిరమ్మ ఇళ్ల నిర్మాణాల్లో ఇసుక కొరత కార ణంగా జరుగుతున్న జాప్యాన్ని నివారించేందుకు ఇసుక కూపన్లు అందజేసేందుకు చర్యలు తీసుకొంటున్నామని జిల్లా గృహనిర్మాణశాఖ పిడి వెంకటేశ్వరరెడ్డి తెలిపారు.

**హౌసింగ్ ప్రాజెక్ట్ డైరక్టర్ వెల్లడి**

ఆగష్టు 22వతేదీన వెంకటగిరికి వచ్చిన ఆయన ఇక్కడ నిర్మిస్తున్న గృహాలను పరిశీలించారు. అనంతరం విలేక రులతో మాట్లాడారు. ఇసుక, సిమెంటు కొరత కార ణంగా జిల్లాలో 50శాతం ఇందిరమ్మ గృహాలు నిలచి పోయాయన్నారు. ఇసుక తరలింపుపై ఆంక్షలు వుండ డంతో నిర్మాణాల్లో జాప్యం పెరిగిందన్నారు. దీన్ని నివా రించేందుకు ప్రతి లబ్ధిదారునికి నాలుగు కూపన్లు ఇచ్చి రీచ్‌ల నుంచి ఇసుక తెచ్చుకొనేలా ప్రణాళిక రూపొం దిస్తున్నామన్నారు. జిల్లాలో 95 లేఅవుట్లలో విద్యుదీక రణకు 3.50 కోట్లు విడుదలైనా టెండర్ల దశలో ఆల స్యం జరుగుతున్నదన్నారు. 40 లేఅవుట్లలో గ్రామీణ నీటి సరఫరాశాఖ ద్వారా, మరో 103 కాలనీల్లో గృహ నిర్మాణశాఖ ద్వారా తాగునీటి వసతి కల్పించేందుకు చర్యలు చేపడుతున్నామన్నారు. అలాగే ఉపాధిహామీ పథకం నిధులతో 269 కాలనీల్లో రోడ్ల నిర్మాణం చేప ట్టడానికి ప్రణాళికలు సిద్ధం చేశామన్నారు.

# విద్యతోనే అభివృద్ధి

## సాక్షరభారత్ సూపర్‌వైజర్ సుధాకర్ రాజు

ప్రపంచ అక్షరాస్యత దినోత్సవాన్ని పురస్కరించు కొని మూడో విడత అక్షరాస్యత కార్యక్రమాన్ని నిర్వహి స్తున్నట్లు సాక్షర భారత్ సూపర్‌వైజర్ సుధాకర్‌రాజు తెలిపారు. వెంకటగిరి మండల పరిషత్ కార్యాల యంలో జరిగిన సమన్వయకర్తల సమావేశానికి ఆయన విచ్చేశారు. జిల్లా వ్యాప్తంగా మహిళల అక్షరా స్యత 57శాతంగా వుందని, దీనిని 70శాతం పెం చేందుకు సమన్వయకర్తలు కృషి చేయాలన్నారు. ప్రతి గ్రామంలో చదువు రాని 30మంది మహిళలను ఎం పికచేసి వారిని అక్షరాస్యులుగా తీర్చిదిద్దాలన్నారు. ఈ కార్యక్రమంలో ఎంపిడిఓ శివప్రసాద్, శ్రీనివాసులు తదితరులు పాల్గొన్నారు.

# అధిక మాస వ్రతంతో సిరిసంపదలు!



ఏడాదిలో పన్నెండు మాసాలు సర్వసాధారణంగా వస్తుంటాయి. అయితే ఈ మాసాలు కాకుండా అధికంగా ఒక మాసం వస్తుంటుంది. దీనిని అధిక మాసం అంటారు. మాసాల గణనలో వివిధ ప్రాంతాల వారు ఒక్కోరకంగా వ్యవహరిస్తారు. దక్షిణ భారతీయులు చాంద్రమానాన్ని, ఉత్తర భారతీయులు సూర్యమానాన్ని అనుసరిస్తారు. చాంద్రమానంలో ప్రతి నెల అవధిగా అమావాస్యను పరిగణిస్తే, ఉత్తర భారతంలో పౌర్ణమిని నెల అవధిగా లెక్కలోకి తీసుకొంటారు. మాసాల గణనలో మనం చాంద్రమానాన్నే అనుసరిస్తాం. చాంద్రమానంలో ఏడాదికి 354 దినాలు. సూర్యమానంలో ఒక సంవత్సరం అనగా 365 రోజులు. సూర్యమాన సంవత్సరానికంటే 11రోజులు తక్కువగా చాంద్రమాన సంవత్సరం వుంటుంది. సూర్యమానం, చాంద్రమానం మధ్య ఏర్పడిన ఈ వ్యత్యాసాన్ని సమన్వయం చేసేందుకు ఏర్పాటు చేసినదే అధికమాసం. ఈ ఏడాది ఆగస్టు 18వతేది మొదలైన అధికమాసం సెప్టెంబర్ 16వ తేది వరకు వుంటుంది.

అధికమాస నిర్ణయం సౌరమాసానుసారంగా జరుగుతుంది. సూర్యుడు ప్రతి మాసంలోనూ ఒక రాశి నుంచి మరొక రాశిలోకి మారుతాడు. దీనినే సూర్య సంక్రమణం అంటారు. చాంద్రమానంలోనూ సూర్యసంక్రమణ జరుగుతుంది. అయితే ఒక మాసంలో మాత్రం సూర్యుడు రాశి మారడు. అంటే సంక్రమణ జరగదు. దీనినే అధిక మాసం అంటారు. ఈ అధిక మాసం తర్వాత వచ్చే మాసం పేరుతోనే అధికమాసాన్ని పిలుస్తారు. ఈ సంవత్సరం భాద్రపద మాసంలో అధిక మాసం వస్తున్న కారణంగా దీనిని అధిక భాద్రపద మాసం అని అంటారు. సాధారణంగా అధిక మాసం రెండు లేదా మూడేళ్లకు ఒకసారి వస్తుంటుంది. సూర్య, చాంద్రమానాల మధ్య సమన్వయం చేయడం కోసం అధిక మాసాన్ని వేద కాలంలోనే ఏర్పాటు చేయడాన్ని చూస్తే మన పూర్వీకుల ఖగోళ విజ్ఞానం అర్థమవుతోంది.

సూర్య సిద్ధాంతపరంగా చెప్పాలంటే భూమి సూర్యుడు చుట్టూ తిరగడానికి పట్టేకాలం 365 రోజుల 6 గంటల 12 నిమిషాల 26 సెకండ్లు. దీనిని నక్షత్రిక గణనము అంటారు. ఆధునిక శాస్త్రపరంగా గానీ, సూర్య సిద్ధాంతపరంగాగానీ చంద్రుడు భూమి చుట్టూ 29.53రోజుల్లో తిరుగుతాడు. దీనిని రెండు మాసాలుగాను, ఒక్కో పక్షాన్ని 15 తిథుల క్రింద విభజించబడింది. ఒక్కో తిథి కనిష్ఠంగా 21 గంటల నుంచి గరిష్ఠంగా 26 గంటల వ్యవధి కల్గి వుంటుంది. దీని ప్రకారం 354 రోజుల్లో 12 మాసాలు పూర్తవుతాయి. ఈ నందన నామ సంవత్సరంలో వచ్చే అధిక భాద్రమాసంలో రవి ఆగస్టు 17 ఉదయం 8.05 గంటలకు సింహరాశిలో ప్రవేశించి సెప్టెంబర్ 17 ఉదయం 8.23 వరకు వుంటాడు. ఏ రాశి మారకుండా వుండడం వల్ల సంభవించేదే అధిక మాసం. ఈ మాసం శుభకార్యాలకు పనికి రాదంటారు. అధిక మాసంలో సంధ్యానుష్ఠానం, దేవతార్చన వంటి నిత్యకార్యక్రమాలను యథావిధిగా నిర్వహించుకోవచ్చు. అలాగే ఏకాదశి, మాస శివరాత్రి వంటి వ్రతాలను జరుపుకోవచ్చు. ఆబ్దికాలు మాత్రం అధిక మాసంలోను, నిజమాసంలోనూ రెండుసార్లు చేయాల్సి వుంటుంది. ఇక వివాహాలు, గృహ ప్రవేశం, అన్నప్రాశన, నామకరణ, ఉపనయనాలు అధిక మాసంలో నిర్వహించరు. ఆలయ ప్రతిష్ఠ, యజ్ఞయాగాదులు ఈ మాసంలో నిషిద్ధం. అధిక మాసం వచ్చినపుడు అధిక మాస వ్రతాన్ని ఆచరించాలని పురాణాలు చెప్తున్నాయి. దీని వలన సిరిసంపదలు కల్గుతాయని చెప్తారు.

## సభలు - సమావేశాలు






# ఆర్‌సిఎం చర్చి శతజయంతి వేడుకలు!

నెల్లూరు సంతపేటలోని రోమన్ క్యాథలిక్ చర్చి శత జయంతి వేడుకలు ఈనెల 24వతేది ఘనంగా జరిగాయి. నెల్లూరు, ప్రకాశం జిల్లాలకు సంబంధించి నెల్లూరులో వేదికను ఏర్పాటు చేశారు. వంద సంవత్సరాల క్రితం ఏర్పాటు చేయబడిన నెల్లూరు వేదిక క్రైస్తవ మత బోధనలు చేయడంతోపాటు అనేక సేవా కార్యక్రమాలు నిర్వహిస్తూ వస్తోంది. పేద విద్యార్థులకు ఉచిత విద్య, భోజన వసతి, గ్రామీణ, పట్టణ ప్రాంతాలకు చెందిన నిరుద్యోగులకు స్వయం ఉపాధిపథకాల్లో శిక్షణ ఇప్పించడం, వృద్ధులకు పెన్షన్ పంపిణీ చేయడం ఎస్సీ, ఎస్టీ కాలనీల్లో ప్రభుత్వ సహకారంతో పక్కా గృహాలు నిర్మించడం వంటి కార్యక్రమాలను చేపట్టింది. అలాగే ప్రకృతి వైపరీత్యాలు సంభవించినప్పుడు బాధితులకు వస్తుసామగ్రి అందించి, ఆర్థికంగా చేయూతనిస్తుంది.

స్వాతంత్ర్యానికి ముందే జిల్లాలో సేవా కార్యక్రమాలు నిర్వహించి ఈ సంస్థ శత జయంతి వేడుకలను జరుపుకోవడం ఎంతో అభినందనీయమని వేడుకలకు హాజరైన నెల్లూరు పార్లమెంటు సభ్యులు మేకపాటి రాజమోహన్‌రెడ్డి పేర్కొన్నారు. క్రైస్తవ సోదరులు ప్రేమ, ఆప్యాయతలను పంచాలని ఆయన కోరారు. సమాజంలో శాంతి, ఐక్యత సంయమనం పాటించి జీవించాలని నెల్లూరు రూరల్ ఎమ్మెల్యే ఆనం వివేకానందరెడ్డి సూచించారు. ఈ కార్యక్రమానికి గుంటూరు, కర్నూల్ బిషప్‌లు గాలి బాలి, పూల అంథోనిలు హాజరై 24 గంటల ప్రార్థన నిర్మాణ శిలాఫలకాన్ని ఆవిష్కరించారు. బాల బాలికలు, యువతులు చేసిన నృత్య ప్రదర్శన విశేషంగా ఆకట్టుకొంది. ఆనందజ్యోతుల నాట్యం, ప్లేటు నృత్యాలు, పుష్పాంజలి ఈ వేడుకల్లో ప్రత్యేకంగా నిలిచాయి.

ఈ కార్యక్రమానికి హాజరైన ప్రజాప్రతినిధులు మేకపాటి రాజమోహన్‌రెడ్డి, చంద్రశేఖర్‌రెడ్డి, ఆనం వివేకానందరెడ్డి, ముంగమూరు శ్రీధర్‌కృష్ణారెడ్డి, వైఎస్సార్ కాంగ్రెస్‌పార్టీ నాయకులు కోటంరెడ్డి శ్రీధర్ రెడ్డి, పి.అనిల్‌కుమార్‌యాదవ్, ఆనం వెంకటరమణా రెడ్డి లను బిషప్ ఎండి ప్రకాశం సత్కరించారు. ఈ సందర్భంగా నిర్వహించిన బలిపూజలో వేలాది మంది క్రైస్తవులు పాల్గొని ప్రార్థనలు నిర్వహించారు.




తలపెట్టిన పనులు నెమ్మదిగా జరుగుతాయి. శరీర శ్రమధికం. ఇంటా బయట మాట పట్టింపులు. ఇతరులతో మాట్లాడేటప్పుడు మంచి చెడులను గ్రహించగలరు. ఆదాయానికి మించిన ఖర్చులు. వృత్తి, వ్యాపారాలలో తరచూ ఆటంకాలు, ఉద్యోగులకు అధికశ్రమ. నమ్మినవాళ్ల మోసం చేయగలరు జాగ్రత్త. విద్యార్థులకు అనుకూలం, కార్యసిద్ధి. వ్యవసాయ అవసరానికి డబ్బు చేతికందుతుంది.




పనులు నిరాసక్తతను కలిగిస్తాయి. ఆర్థిక వ్యవహారాలు మందగిస్తాయి. బంధుమిత్రులతో స్వల్ప వివాదాలు చోటు చేసుకొంటాయి. వృత్తి, వ్యాపారాలలోని వారికి ఆర్థిక ఇబ్బందులు. ఉద్యోగులకు దూర ప్రయాణాలు శ్రమను కలిగిస్తాయి. విద్యార్థులకు శ్రమ, ఒత్తిడి పెరుగుతుంది. వ్యవసాయదారుల ఆర్థిక సమస్యలు తీరుతాయి. కళా, క్రీడా రంగాలలోని వారికి ఇతరుల సహకారం సంపూర్ణంగా లభిస్తుంది.




గతవారం కంటే మేలనిపిస్తుంది. పనులన్నీ సకాలంలో పూర్తి చేయగల్గుతారు. చేసే పనులలో ఆత్మవిశ్వాసం వుంటుంది. వృత్తి, వ్యాపార, వ్యవసాయాలలోనివారు ఆర్థికంగా నిలదొక్కుకొంటారు. విద్యార్థుల ప్రయత్నాలు ఫలిస్తాయి. కళా, క్రీడా రంగాలలోనివారు వృత్తిపట్ల అనుకున్నవన్నీ సాధిస్తారు. రాజకీయులు తమ సంతానాభివృద్ధికై కృషి చేస్తారు. కార్యసిద్ధి. ఒకవార్త మీ ఆత్మవిశ్వాసాన్ని పెంచుతుంది.




పనుల పట్ల శ్రద్ధ అవసరం. ఆటంకాలేర్పడగలవు. ప్రతి పని ఆలోచించి చేయాల్సి వుంటుంది. వృత్తి, వ్యాపారాలు స్థిరాదాయాన్ని కల్గివుంటాయి. ఉద్యోగులకు శ్రమ వున్నా మంచి ఫలితాలు, పై అధికారుల గుర్తింపు లభిస్తుంది. ఇంట్లో శుభకార్య ప్రయత్నాలు ప్రారంభిస్తారు. విద్యార్థులు తోటి విద్యార్థులలో మంచి గుర్తింపు పొందుతారు. వ్యవసాయదారులకు ఆశించిన లాభాలు రాకపోవచ్చు.




ఈ రాశివారికి అనుకూల పరిస్థితులున్నాయి. చేసే పనులు పూర్తి కాగలవు. శరీరారోగ్యం బాగుంటుంది. ఇంట్లో శుభకార్య యత్నం ఫలిస్తుంది. వృత్తి, వ్యాపార, ఉద్యోగులకు ఆర్థిక వ్యవహారాలు సంతృప్తినిస్తాయి. విద్యార్థులు తమ ఊహలను నిజాలు చేసుకొంటారు. వ్యవసాయదారులకు పరిస్థితులు అనుకూలంగా వుంటాయి. కళా, క్రీడా రంగాలలోనివారికి చిన్న సమస్యలున్నా ఆర్థికంగా బాగుంటుంది.




చేసే పనులలో కొన్నింటికి ఆటంకాలు తప్పకపోవచ్చు. మరికొన్ని తల నొప్పి కల్గిస్తాయి. ఇంట్లో సుఖశాంతులు తక్కువ. కాని, శుభకార్యాల నిమిత్తం వస్తు, ఆభరణాలు కొనుగోలు చేస్తారు. విద్యార్థులు తమ విద్య యందు మానసిక పరిణతి కలిగి వుంటారు. వ్యవసాయదారులకు ఆర్థిక సమస్యలు తగ్గుతాయి. రాజకీయులకు తోటివారితో చిన్నపాటి విభేదాలు వచ్చే సూచనలున్నాయి..

# వారఫలాలు

*తేది 01-09-2012 నుండి 07-09-2012 వరకు వృషభంలో గురు, కేతువులు; 1తేది వరకు మిథునంలో శుక్రుడు తదుపరి కర్కాటకంలో; సింహంలో రవి, బుధులు; తులలో కుజ, శనులు; వృశ్చికంలో రాహువు; కుంభ, మీన, మేష, వృషభాలలో చంద్రుడు సంచరిస్తారు.*

## పంచాంగం

4తేది సంకష్ట చతుర్థి.
5తేది టీచర్స్ డే.

### శుభ ముహూర్తాలు

అధిక భాద్రపదమాసం శూన్యమాసం కావడంతో వివాహాది శుభకార్యాలకు ముహూర్తాలు లేవు. సీమంత, అన్నప్రాసనాది సామాన్య శుభకార్యాలకు సుముహూర్తాలున్నాయి.

### సెప్టెంబరు తిథులు
**అధిక భాద్రపద బహుళ**

| | | | |
|---|---|---|---|
| 1 | శని | పాడ్యమి | సా 07.14 గం.ల.వ |
| 2 | ఆది | విదియ | సా 07.37 గం.ల.వ |
| 3 | సోమ | తదియ | రా 08.37 గం.ల.వ |
| 4 | మంగళ | చవితి | రా 10.14 గం.ల.వ |
| 5 | బుధ | పంచమి | రా 12.23 గం.ల.వ |
| 6 | గురు | షష్టి | రా 02.52 గం.ల.వ |
| 7 | శుక్ర | సప్తమి | తె 05.28 గం.ల.వ |

**అక్కరాజు బాలసుబ్రహ్మణ్యం**
7/34, దొడ్ల సుబ్బారెడ్డి నగర్, నవలాకులతోట,
నెల్లూరు – 2. సెల్: 95819 76599.




పనులు సకాలంలో పూర్తి చేస్తారు. ఆర్థిక పరిస్థితి మెరుగ్గా వుంటుంది. వృత్తి, వ్యాపార, ఉద్యోగుల్లోని ప్రతిభ వెలికి వస్తుంది. ఉద్యోగులకు పైఅధికారుల ప్రశంసలు లభిస్తాయి. విద్యార్థులు చదువుపై శ్రద్ధ కలిగి, మనసు అదుపులో వుంచుకొంటే మంచిది. వ్యవసాయదారులు స్వల్ప కష్టంతో ఆర్థిక విజయం సాధిస్తారు. కళ, క్రీడలలోని వారికి ఆర్థిక సమస్యలు వృత్తికి ఆటంకం కలిగిస్తాయి.




అన్ని విషయాలలో జాగ్రత్తలవసరం. పనులన్నీ వాయిదాపడే అవకాశాలున్నాయి. కొంత స్వయంకృతంగా నష్టపోతారు. వృత్తి, వ్యాపారాలలోని వారికి సామాన్య ఫలితాలుంటాయి. ఉద్యోగులకు అధిక శ్రమ, అలసట, చంచలబుద్ధి, కోపం, ఆకస్మిక ప్రయాణాలుంటాయి. విద్యార్థులు ప్రణాళికలు సవరించుకొంటే విజయం లభిస్తుంది. వ్యవసాయదారులకు పనులలో ఖర్చులు అదుపులో వుండక పోవచ్చు.




పనులన్నీ సకాలంలో పూర్తయ్యి ఆర్థికంగా లాభాలు పొందుతారు. నూతన వస్తు, వస్త్రాభరణాలు సమకూర్చుకొంటారు. నూతన వ్యక్తులతో పరిచయాలు మంచి చేస్తాయి. వృత్తి, వ్యాపారాలలోని వారికి ఆర్థికాదాయాలుంటాయి. వ్యవసాయదారులు శ్రమాధిక్యత వున్నా శరీరారోగ్యం నిర్లక్ష్యం చేయవద్దు. కళ, క్రీడా రంగాలలోని వారికి అన్ని వ్యవహారాలలో విజయం లభిస్తుంది.




పనులు సకాలంలో పూర్తి చేస్తారు. ఆర్థిక పరిస్థితి మెరుగ్గా వుంటుంది. వృత్తి, వ్యాపార, ఉద్యోగుల్లోని ప్రతిభ వెలికి వస్తుంది. ఉద్యోగులకు పైఅధికారుల ప్రశంసలు లభిస్తాయి. విద్యార్థులు చదువుపై శ్రద్ధ కలిగి, మనసు అదుపులో వుంచుకొంటే మంచిది. వ్యవసాయదారులు స్వల్ప కష్టంతో ఆర్థిక విజయం సాధిస్తారు. కళ, క్రీడలలోని వారి ఆర్థిక సమస్యలు వృత్తికి ఆటంకం కలిగిస్తాయి.




తలపెట్టిన పనులు క్రమబద్ధంగా పూర్తవుతాయి. ఆధ్యాత్మిక, ఇతర సేవా కార్యక్రమాలలో పాల్గొంటారు. వృత్తి, వ్యాపార, ఉద్యోగులకు ఆర్థికంగా సంతృప్తినిస్తుంది. విద్యార్థులు చదువుపై స్పష్టత కలిగి మనోధైర్యంగా వుండాలి. వ్యవసాయదారుల ఆర్థికపరిస్థితి క్రమేణా మెరుగౌతుంది. కళ, క్రీడా రంగాలలోని వారికి దూర ప్రయాణాలు లాభిస్తాయి. ఆకస్మిక ఆదాయం లభిస్తుంది.




చేసే పనులలో ఆటంకాలు లేదా మందగిస్తాయి. ఆకస్మిక ప్రయాణాలు ఇబ్బందులకు గురి చేస్తాయి. బంధుమిత్రులతో వివాదాలు, అవసరానికి రుణాలు చేయవలసి రావచ్చు. అనుకోని ఖర్చులుంటాయి. విద్యార్థులకు శుభాశుభమిశ్రమంగా వుంటుంది. వ్యవసాయదారులకు పనులలో ఒత్తిడి, అధికశ్రమ, ఆర్థిక అసమాన్యతలుంటాయి. రాజకీయులకు ఈ వారం సామాన్యంగా వుంటుంది.

# సఫల ధ్రువాది 'షోడశ' వాస్తు గ్రహ చక్రం!

## వాస్తు సందేహాలు సమాధానాలు

**ఆచార్య సుబ్రహ్మణ్య మహర్షి**
4వ వీధి, గాయత్రినగర్, ఎ.కె. నగర్ పోస్టు, నెల్లూరు-4.
ఫోన్: 2322345, సెల్: 9490125878.

డాక్టర్ కుముదినీరెడ్డి — చెన్నై

** వాస్తుశాస్త్రాలలో తరచూ సఫల ధ్రువాది షోడశ వాస్తు గ్రహ చక్ర ప్రస్తావనలున్నవి. విశ్లేషించండి?*

ఇంటి తలుపుల దిశల సూచిక, ధ్రువాది నామములు, ఫలములను సూచించు పదహారు దిక్కుల విశేషాలు ఈ చక్రంలో ఉంటాయి. ఉదాహరణకు పూర్వ(తూర్పు) ముఖం ధాన్యసమృద్ధి, ధనప్రదమని శాస్త్రాలలో వివరణలున్నవి. ఇలాగే పదహారు దిక్కులకూనూ.

పి.శాంభవీరెడ్డి — చెన్నై

** ఇంట్లో అందరూ కష్టపడతారు. అయినా ఏమీ మిగలడం లేదు.*

నాలుగు దిక్కుల్లో ఏది ప్రత్యేకమైన దృష్టిని విడిచి పెట్టింది. గృహంలో అవాస్తు దోషాల్ని సరిచేసుకొంటే మీ సమస్యలు పరిష్కరింపబడుతాయి.

ఐ.శంకరయ్య — తోటపల్లిగూడూరు

** తూర్పు ఈశాన్యంలో మెట్లున్నవి. ఆర్థిక పరిస్థితి చిన్నాభిన్నమైనది.*

ఈశాన్యం మెట్లు ఆర్థిక, ఆరోగ్యాలను నాశనం చేస్తాయి. వాటిని తీసివేసి ఆగ్నేయంలో నిర్మించండి.

డి.వి.రెడ్డి — నాయుడుపేట

** 'గుణమేళన' వంటి అనేక నిర్ణయాలను మీరు సమర్థిస్తారా?*

వధూవరులకు పూర్వశాస్త్రకారులు కొన్ని ఫలితాలను వారి వారి నక్షత్రాలను బట్టి చెప్పారు. అందులో ఇదొకటి. ఇలాంటి నిర్ధారణలలో యాభై శాతం బాగుంటే చాలు. ఛాందసాలతో వివాహాలు చెడగొట్టబల్లేరు.

పి.మోహన్‌రావు — గూడూరు

** రోడ్ల మలుపుల వల్ల దిక్కులు మారుతాయా?*

అది కేవలం మన భ్రమ! సముద్ర తీర ప్రాంతం ఎన్ని మలుపులు తిరిగినా అది తూరుపే. (నెల్లూరు జిల్లాలో) ఉత్తరాన్ని తూర్పుగా భ్రమించకండి.

కె.వి.సుకన్య — నెల్లూరు

** ఎవరికి ఏ యంత్రం వస్తుందో ఎలా తెలుస్తుంది?*

యజమాని జన్మ నక్షత్రం, ఇంటి దిక్కులోపాలను బట్టి ఇరవై ఎనిమిది యంత్రాలలో ఒక్క దానిని నిర్ణయిస్తారు.

డి.ప్రభావతి — గూడూరు

** సరిచూసి పెట్టిన 'లగ్నాలు' దంపతుల పట్ల దుష్ప్రభావాల్ని ఎలా చూపిస్తున్నాయి?*

శాస్త్రం గొప్పది. లగ్నబలాల్ని నిర్ణయించేది మనుషులు. పరిపూర్ణత అందరిలోనూ ఉండకపోవచ్చు. అందువల్ల నిష్ణాతుల్నే మనం ఎంచుకోవాలి. దైవజ్ఞుల విజ్ఞత, అజ్ఞతలను బట్టి ప్రభావాలుంటాయి.

బి.శ్రీకర్‌నాయుడు — బైరెడ్డిపల్లె

** యంత్ర ప్రతిష్ట తర్వాత సమస్యల చిక్కుముడి వీడి పోయింది. ఎందువల్ల?*

యంత్ర సారస్వతం మహర్షులు రచించినది. మంత్ర సమన్వితమైన బీజాక్షరాలు గృహంపై అమితమైన ప్రభావాన్ని చూపిస్తాయి. అందువల్లే మీకు మంచి ఫలితాలు కలిగాయి.

డి.ప్రసాదరాయశాస్త్రి — హైదరాబాద్

** వివాహ మంత్రాలలో కొందరు మామూలు పూజా మంత్రాలను కూడా చదివి పారేస్తున్నారు.*

'వశిష్ట సంహిత', విశ్వామిత్ర మంత్రవిధి వంటి గ్రంథాలు ఈ అపసవ్య పద్ధతుల్ని నిరాకరిస్తున్నాయి. వివాహ మంత్రాలలో సాధారణ మంత్రాలను చదవడం మంచి పద్ధతి కాదు. ప్రేక్షకులలో పండితుల పట్ల చులకన భావం కలిగే అవకాశం ఉంది.

ఇ.అరుణ్‌రెడ్డి — కర్నూలు

** గృహ నిర్మాణంలో ఎవరో ఒక కూలీ ఏదో ఒక విధంగా గాయాలపాలవుతున్నారు.*

ఇట్లా వరుసగా జరుగుతూ ఉంటే మీ స్థలంపై శక్తివేధ ఉన్నట్లే లెక్క. అందువల్ల 'శక్తి యంత్ర' ప్రతిష్ట చేయడం మంచిది.

వి.శంకరస్వామి — విజయవాడ

** వాస్తు సరిచేసుకున్నాను. అయినా పరిస్థితులేమీ మెరుగు పడలేదు.*

ఎక్కడో లోపాలుంటాయి. జన్మ నక్షత్రం, గృహం ప్లానునుసరించి యంత్ర ప్రతిష్ట చేసుకొని చూడండి. ఫలితం ఉంటుంది.

### ● జిల్లా సమీక్షా సమావేశంలో

# సమస్యలపై అధికారపక్షాన్ని నిలదీసిన ప్రతిపక్షం!

**● 30 నెలల విరామం తర్వాత 25వ తేది జరిగిన జిల్లా సమీక్షా సమావేశంలో ప్రజలు ఎదుర్కొంటున్న సమస్యలపై సమాధానం చెప్పాలంటూ ప్రతిపక్ష ఎమ్మెల్యేలు గట్టిగా నిలదీయడంతో అధికార పక్షం బాగా ఇబ్బంది పడింది.**



సమీక్షా సమావేశంలో మాట్లాడుతున్న జిల్లా ఇన్‌ఛార్జ్ మంత్రి పితాని సత్యనారాయణ.

ప్రతిపక్ష పార్టీలకు చెందిన ఎమ్మెల్యేలు ప్రజా సమస్యలపై స్పందించారు. జిల్లాలో ప్రస్తుతం నెలకొన్న విద్యుత్ సమస్య, సాగునీటి ప్రాజెక్టులు, వ్యవసాయం, ఇందిరమ్మ గృహాలు, ఇసుక అక్రమ రవాణా, సంక్షేమంపై ప్రభుత్వం తీసుకుంటున్న చర్యలపై ఎమ్మెల్యేలు అధికారులను నిలదీశారు. 25వ తేది జిల్లాపరిషత్ సమావేశమందిరంలో జిల్లా సమీక్షా సమావేశం జరిగింది. జిల్లా ఇన్‌చార్జి మంత్రి పితాని సత్యనారాయణ అధ్యక్షతన జరిగిన ఈ సమావేశంలో ప్రతిపక్ష ఎమ్మెల్యేలు ప్రశ్నల వర్షం కురిపించడంలో పైచేయి సాధించారని చెప్పవచ్చు.

జిల్లాలో వున్న 10మంది ఎమ్మెల్యేలో నలుగురు మాత్రం అధికారపార్టీకి చెందిన వారుకాగా మిగిలిన ఆరుగురిలో ఇద్దరు వైఎస్సార్ కాంగ్రెస్‌పార్టీ, నలుగురు తెలుగుదేశంపార్టీకి చెందిన వారున్నారు. అజెండాలో మొత్తం 14 అంశాలను చేర్చి సమీక్షించాలని అధికార యంత్రాంగం నిర్ణయించింది. గూడూరు ఎమ్మెల్యే బల్లి దుర్గాప్రసాద్‌రావు నీటి పారుదలశాఖ, ఇందిరమ్మ ఇళ్లు, ఇసుక అక్రమ రవాణా అంశాలపై కూడా సమావేశంలో చర్చించాలన్న ప్రతిపాదనను ఇన్‌చార్జి మంత్రి అంగీకరించి సమీక్షించడం జరిగింది. ఉదయం 10.30 గంటలకు సమావేశం ప్రారంభం కావాల్సి వుండగా ఇన్‌చార్జి మంత్రి రాక ఆలస్యం కావడంతో నిర్ణయించిన సమయానికంటే గంటన్నర ఆలస్యంగా సమావేశం ప్రారంభించారు. ఇసుక రీచ్‌లన్నింటికి వేలం పాటలు నిర్వహించకపోవడంతో ఎన్నడూలేని విధంగా ఇసుకను అధిక ధరలకు విక్రయిస్తున్నారని ఎమ్మెల్యేలు ఆరోపించారు.

మద్యం ధరలను నిర్ణయించిన విధంగానే ఇసుక ధరలను కూడా ప్రభుత్వం నిర్ణయించి ఇసుకను రీచ్‌లలో విక్రయించే విధంగా చర్యలు తీసుకోవాలని తెలుగుదేశంపార్టీ ఎమ్మెల్యేలు ఇన్‌చార్జి మంత్రికి విజ్ఞప్తి చేశారు. అలాగే చిల్లకూరు మండలం నుంచి అక్రమంగా సిలికా రవాణా జరుగుతున్నా సంబంధితశాఖ అధికారులు నియంత్రించలేకపోతున్నారని గూడూరు ఎమ్మెల్యే బల్లి దుర్గాప్రసాద్‌రావు అన్నారు. కొత్తూరు సమీపంలోని వైఎస్సార్‌నగర్‌లో ఇందిరమ్మ గృహాలను నాసిరకంగా నిర్మించడం వలన ఒక ఇల్లు కూలిపోయిందని, మిగిలిన ఇళ్ల పరిస్థితి కూడా ఇలాగే వుందని నెల్లూరు పార్లమెంటుసభ్యులు మేకపాటి రాజమోహన్‌రెడ్డి అన్నారు. ఇళ్లు నిర్మించిన కాంట్రాక్టర్లు, పర్యవేక్షణ చేసిన ఇంజినీర్లపై చర్యలు తీసుకోవాలని ఎమ్పీ డిమాండ్ చేశారు.

ఈ అంశాలపై నెల్లూరు రూరల్ ఎమ్మెల్యే ఆనం వివేకానందరెడ్డి స్పందిస్తూ ఇందిరమ్మ ఇళ్ల నిర్మాణంలో అక్రమాలకు పాల్పడిన వారిపై చర్యలు తీసుకోవాలని కోరుతూ... ఇళ్లను కొందరు రాజకీయ కక్షతో ధ్వంసం చేశారన్న అభియోగం వుందని దీనిపై కూడా విచారణ జరిపించాలని కోరారు. వైఎస్ ఆర్‌నగర్‌లో ఇళ్లు నిర్మించి దాదాపు మూడు సంవత్సరాలు గడిచిందని ప్రస్తుతం విమర్శిస్తున్నవారు అప్పట్లో చాలా బాగున్నాయని కితాబు ఇచ్చారని నెల్లూరు ఎమ్పీని వుద్దేశించి పరోక్షంగా విమర్శించడం జరిగింది. జలయజ్ఞం పనుల్లో ప్రతిపక్షపార్టీలకు చెందిన ఎమ్మెల్యేల నియోజకవర్గాల్లో అన్యాయం జరుగుతున్నదని ఉదయగిరి ఎమ్మెల్యే మేకపాటి చంద్రశేఖర్‌రెడ్డి, కావలి ఎమ్మెల్యే బీద మస్తాన్‌రావులు వాపోయారు. ఇందుకు సంబంధించి కావలి కాలువను ఉదాహరణగా పేర్కొన్నారు.

కాలువ పనులు సకాలంలో పూర్తి చేయకపోవడంతో ఆయకట్టు రైతులు సాగునీరందక తీవ్రంగా నష్టపోతున్నారని ఆవేదన వ్యక్తం చేశారు. సూళ్లూరుపేట ఎమ్మెల్యే పరసారత్నం మాట్లాడుతూ సూళ్లూరుపేటలో తాగునీరు సరఫరా కాక ప్రజలు ఇబ్బంది పడుతున్నారన్నారు. సమీపంలో వున్న షార్‌కు సూళ్లూరుపేట నుండి తాగునీరు సరఫరా అవుతుండగా పట్టణ ప్రజలకు అందించలేకపోవడం ఆవేదన కలిగిస్తుందన్నారు. ఇందుకు ఎమ్మెల్సీ వాకాటి నారాయణరెడ్డి కూడా మద్దతు తెలుపుతూ సూళ్లూరుపేట పట్టణ ప్రజలకు అవసరమైన తాగునీటిని షార్ అధికారులు అందించే విధంగా ప్రభుత్వం కృషిచేయాలని కోరారు. సెప్టెంబర్ 9న షార్‌కు ప్రధానమంత్రి వస్తున్నందున సిఎంతో చర్చించి అవసరమైన నివేదికను సమర్పించాలని వాకాటి నారాయణరెడ్డి మంత్రులను కోరారు.

ఎమ్మెల్సీలు వితపు బాలసుబ్రహ్మణ్యం, శ్రీనివాసులరెడ్డిలు మాట్లాడుతూ జిల్లా విద్యాశాఖాధికారి మువ్వా రామలింగం ప్రోటోకాల్ పాటించకుండా నిర్లక్ష్యంగా వ్యవహరిస్తున్నాడన్నారు. ఉపాధ్యాయుల పట్ల నిరంకుశంగా వ్యవహరిస్తున్న డిఇఓపై వెంటనే చర్యలు తీసుకోవాలని వారు డిమాండ్ చేశారు. ఈ సమావేశంలో మంత్రి ఆనం రామనారాయణరెడ్డి సర్వేపల్లి ఎమ్మెల్యే ఆదాల ప్రభాకర్‌రెడ్డి, నెల్లూరు నగర ఎమ్మెల్యే ముంగమూరు శ్రీధర్‌కృష్ణారెడ్డి, వెంకటగిరి ఎమ్మెల్యే కురుగొండ్ల రామకృష్ణ, జిల్లా కలెక్టర్ శ్రీధర్ వివిధ శాఖల అధికారులు పాల్గొన్నారు.

పోరుబాట

# పరిశ్రమలకు భూములిచ్చిన ప్రజల ఆందోళన!

రెండు సంవత్సరాల విరామం అనంతరం ప్రత్యేక ఆర్థిక మండళ్ల ఏర్పాటు కోసం భూములు అప్పగించిన ప్రజలు ఆందోళన ప్రారంభించారు. ప్రజల నుంచి భూములు సేకరించే సమయంలో అధికారులు, ప్రజాప్రతినిధులు చేసిన ప్రకటనలకు, పరిశ్రమలు స్థాపించిన తర్వాత సంస్థల ప్రతినిధులు వ్యవహరిస్తున్న తీరుకు చాలా వ్యత్యాసం ఉంటుంది. పరిశ్రమల ఏర్పాటుకోసం భూములు అప్పగించి జీవనోపాధి కోల్పోతున్న విషయం ప్రజలు గ్రహించి పరిశ్రమల నిర్మాణాన్ని వ్యతిరేకిస్తున్నారు. ఇదే విషయాన్ని జిల్లాస్థాయి అధికారులకు పలుమార్లు విన్నవించుకున్నా పరిశ్రమల నిర్మాణాల నిలిపివేతపై ఎటువంటి హామీ ఇవ్వలేక పోయారు. జిల్లాలో మంజూరు చేసిన ప్రత్యేక ఆర్థిక మండళ్లలో వ్యతిరేకత, ఇబ్బంది లేకుండా నడుస్తూ ఉందేది ఒక్క అపాచీ బూట్ల తయారీ పరిశ్రమ మాత్రమే. మిగిలిన వాటి ఏర్పాటుపై స్థానిక గ్రామాల ప్రజల నుంచి వ్యతిరేకత వ్యక్తమవుతుంది.

మిగిలిన పరిశ్రమలకు భూములు అప్పగించినా కొన్ని నిర్మాణాలే చేపట్టక పోవడం విశేషం. కొడవలూరు మండలం రాచర్లపాడు వద్ద ఇఫ్కో ఆధ్వర్యంలో రైతులకవసరమైన వ్యవసాయ పనిముట్ల తయారీ కేంద్రానికి దాదాపు 2,400 ఎకరాల మాగాణి భూములు కేటాయించింది ప్రభుత్వం. అప్పటి ముఖ్యమంత్రి వైఎస్ రాజశేఖర్‌రెడ్డి శంకుస్థాపన కూడా చేయడం జరిగింది. శంకుస్థాపన చేసి ఐదు సంవత్సరాలు కావస్తున్నా నిర్మాణ పనులు మాత్రం చేపట్టలేక పోయారు. ఈ సెజ్ కోసం సేకరించిన భూముల్ని తిరిగి తమకు అప్పగించాలని రైతులు డిమాండ్ చేస్తున్నారు. ప్రభుత్వం స్పందించకుంటే రాష్ట్ర హైకోర్టును ఆశ్రయించి భూములు స్వాధీనం చేసుకుంటామని చెబుతున్నారు.

ఇదే బాటలో నాయుడుపేట మండలం మేనకూరులో సెజ్ ఏర్పాటును అక్కడి ప్రజలు వ్యతిరేకిస్తున్నారు. ఇటీవల ఈ గ్రామ పంచాయితీలో కెమికల్ లాబొరేటరీ పరిశ్రమ ఏర్పాటు చేసేందుకు కాలుష్య నియంత్రణ మండలి ఆధ్వర్యంలో ప్రజాభిప్రాయ సేకరణ కార్యక్రమం నిర్వహించడం జరిగింది. ఈ సెజ్‌ను 450 ఎకరాల్లో దాదాపు 20 కోట్ల రూపాయలతో ఏర్పాటు చేయాలన్నది సంస్థ ప్రతిపాదన. సెజ్ నిర్మాణం కోసం భూములు కోల్పోయిన వారికి ప్రభుత్వం 25 సెంట్ల భూమిని ప్రత్యామ్నాయంగా ఇస్తుందని అధికారులు ప్రకటించారు. అలాగే సమీప గ్రామాల ప్రజలకు పరిశ్రమలో ఉపాధి అవకాశాలు కల్పిస్తామన్న హామీ కూడా ఇచ్చారు. ప్రజాభిప్రాయ సేకరణలో అధికారులు, సంస్థ ప్రతినిధులు ఎన్ని హామీలు గుప్పించినా ప్రజలు మాత్రం ఇక్కడ ఫ్యాక్టరీ ఏర్పాటును ఎట్టి పరిస్థితుల్లో అంగీకరించేది లేదని స్పష్టం చేశారు. ప్రభుత్వం తరపున గూడూరు ఇన్‌ఛార్జి ఆర్డీఓ వెంకట సుబ్బయ్య, నాయుడుపేట తహశీల్దార్ చెంచు కృష్ణమ్మ, ఎమ్పీడిఓ ప్రమీలారాణి, కెమికల్ ల్యాబొరేటరీ సంస్థ తరపున గోపాల్, రవి తదితరులు పాల్గొన్నారు. పరిశ్రమ నిర్మిస్తే అందులో నుంచి వెలువడే రసాయనిక పదార్థాల కారణంగా అనారోగ్యం పాలవుతామని ప్రజలు అధికారుల దృష్టికి తీసుకొచ్చారు.

భూములు తీసుకొని సంవత్సరాలు గడుస్తున్నా పరిశ్రమల నిర్మాణాలు ఎందుకు చేపట్టలేదని అధికారులను ప్రశ్నించి ఆగ్రహం వ్యక్తం చేశారు. పరిశ్రమల ఏర్పాటుకు ప్రజాభిప్రాయ సేకరణ కార్యక్రమాన్ని జిల్లా కలెక్టర్, జాయింట్ కలెక్టర్ ఆధ్వర్యంలో నిర్వహిస్తుంటారు. అయితే మేనకూరు వద్ద జరిగిన కార్యక్రమానికి జిల్లా కలెక్టర్ హాజరు కాకుండా గూడూరు ఆర్డీఓను పంపడంపై విమర్శలు వినిపిస్తున్నాయి. జిల్లా కలెక్టర్ శ్రీధర్‌రెడ్డి ఈ నెల 22వ తేది పెళ్లకూరు మండలంలో పాఠశాలలు, ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలను తనిఖీ చేసేందుకు వెళ్లారు. ప్రక్క మండలంలో పర్యటించిన కలెక్టర్ ప్రజాభిప్రాయ సేకరణ కార్యక్రమానికి మధ్యలో హాజరౌతారని అందరూ భావించారు. మేనకూరుకు వెళితే ప్రజల నుంచి నిరసనలు ఎదుర్కోవాల్సి వస్తుందన్న అభిప్రాయంతో కలెక్టర్ అటు వైపు వెళ్లలేకపోయారు. మేనకూరు ప్రజలకు మద్దతుగా రాజకీయ పార్టీల నేతలు, స్వచ్ఛంద సంస్థల ప్రతినిధులు అండగా నిలిచారు. కార్యక్రమం చివరిదశకు చేరుకున్న సమయంలో ఉద్రిక్తత ఏర్పడింది. దీంతో ఎటూ తేల్చలేని అధికారులు ఈ విషయాన్ని ఉన్నతాధికారుల దృష్టికి తీసుకెళతామని చెప్పి అక్కడ నుంచి వెళ్లిపోవడం విశేషం.

> **జిల్లాలో ప్రత్యేక ఆర్థిక మండళ్ల నిర్మాణం కోసం భూములిచ్చిన ప్రజలు ఆందోళన బాట పడుతున్నారు. భూములు సేకరించే సమయంలో అధికారులు, ప్రజాప్రతినిధులు చేసిన ప్రకటనలకు, పరిశ్రమలు స్థాపించిన తర్వాత సంస్థల ప్రతినిధులు వ్యవహరిస్తున్న తీరుకు చాలా వ్యత్యాసం ఉండడంతో పోరుబాట తప్పడం లేదు.**




✍ అల్లూరు రహీం

దర్శకుడు భీమినేని శ్రీనివాసరావుకు తమిళ చిత్రాలు బాగా చూసే అలవాటుంది. ఆయన గతంలో తీసిన శుభాకాంక్షలు, సుస్వాగతం, సూర్యవంశం, దొంగోడు, అన్నవరం చిత్రాలు తమిళ రీమేక్‌లే. చాలా రోజుల విరామం తర్వాత అరుంధతి మూవీస్ పతాకంపై అల్లరి నరేష్‌ను హీరోగా పెట్టి తీసిన చిత్రం సుడిగాడు. ఈ చిత్రం కూడా తమిళంలో విజయవంతమైన 'తమిళ పడమ్'కు రీమేక్‌నే. చిత్ర పరిశ్రమకు గ్లామర్ తప్పితే గ్రామర్ లేదని, ఏ సినిమా విజయవంతం అయితే అదే గ్రామర్ అన్ని చెప్పే భీమినేని 2000 సంవత్సరం నుంచి ఇటీవల విడుదలైన జులాయి చిత్రం వరకు వంద సినిమాల పేరడీగా సుడిగాడు చిత్రం తీశాడు. ఈ సినిమా కథా విస్తరణ, మాటలు, స్క్రీన్‌ప్లే, దర్శకత్వం అన్నీ ఆయనే. ఒకట్రెండు చిత్రాల పేరడీలైతే ప్రేక్షకుల తలకెక్కుతాయి. వంద చిత్రాలను ఒక సినిమాగా రెండున్నర గంటల్లో చూపించడం ఈ రీమేక్ చిత్రాల దర్శకునికి సాధ్యం కాలేదు. పవన్‌కళ్యాణ్, బాలకృష్ణ, మహేష్‌బాబు, ఎన్టీఆర్, అల్లు అర్జున్, రామ్‌చరణ్, రవితేజ, నాగచైతన్య, ప్రభాస్ లాంటి హీరోల్లో ఎవరినీ వదలకుండా వారు సినిమాల్లో పలికిన డైలాగులకు పోలిన కిండల్ డైలాగులు, సన్నివేశాలకు అతిజోడిస్తూ రీళ్లు చుట్టిన వైనం సుడిగాడులో తలబొప్పి కట్టిస్తుంది. పేరడీల్లో నటించడం హీరో నరేష్‌కు కొత్తకాకపోయినా ఆయన అందరు నటులను అనుకరించను బాగా ఇబ్బంది పడిపోయాడు. పుట్టిన పిల్లవాడు రెండు నిమిషాల్లో మాట్లాడడం, బుల్లెట్లు నమిలి మింగడం, హీరో 8 ప్యాక్స్ కమింగ్ సూన్ అంటూ బాడీపై వ్రాసుకొని ప్రదర్శించడం, కరెంట్ కోతలపై సెటైర్లు బాగున్నాయి. జెమినీలో ప్రసారమయ్యే మొగలిరేకులు, జీ – టీవీలో ప్రసారమయ్యే 'ఆట' కార్యక్రమాలను గేలిచేస్తూ చూపించాడు. విచిత్రంగా ఈ ఎపిసోడ్‌లో డ్యాన్స్ మాస్టర్ శివ సుబ్రహ్మణ్యం, పోసాని కృష్ణమురళి తమను తాము తక్కువ చేసుకొంటూ కనపడడం విశేషం. ప్రధాని మన్మోహన్‌సింగ్, సిఎం కిరణ్‌కుమార్‌రెడ్డి, దివంగత ముఖ్యమంత్రి రాజశేఖర్‌రెడ్డిలను కూడా దర్శకుడు తెరపై వాడుకొన్నాడంటే ఎంత సాహసానికి ఒడిగట్టాడో అర్థం చేసుకోవచ్చు.

చిత్ర సమీక్ష

హీరోయిన్ మోనాల్ గుజ్జర్ ఆకర్షణీయంగా లేకపోవడం, వసంత్ సంగీత దర్శకత్వం అంతంతమాత్రంగా ఉండడం ఈ చిత్రాన్ని ఇంకా బలహీనపర్చాయి. దర్శకుడు క్యాచి కామెడీ డైలాగులు బాగానే వ్రాశాడు. సునామీలో స్విమ్మింగ్ చేస్తారా? తాగితే లివర్ పాడవుతుంది తప్ప లవర్ రాదు ఆలోచింప చేస్తాయి. నేను అరిస్తే అరుపులే, నేను తొడకొడితే అదోలా ఉంటుందని పూరీజగన్నాథ్, వి.వి.వినాయక్ చెప్పడం తప్ప నాకు తెలియదు. కరెంట్ తీగ కూడా నాలాగా సన్నగా ఉంటుంది. ముట్టుకొంటే షాకే డైలాగులు యువ హీరోలను కిండల్ చేసేవే.

చిత్రకథలోని వెళ్తే రాయలసీమలోని సీమాపురం వాసి రాజేష్(అల్లరి నరేష్). ఆయన భార్య హేమ లేబర్ రూంలో నవ్వుతూ ప్రసవిస్తుంది. వీళ్ల బాబు శివ(అల్లరి నరేష్) హాస్పిటల్‌లో పోసిన మూత్రంపై కాలుపెట్టి జారిపడి ఫ్యాక్షనిస్ట్ తిక్కలనాయుడు(జయప్రకాష్‌రెడ్డి) మనిషి మరణిస్తాడు. పుట్టగానే మాట్లాడే శివకొట్టిన దెబ్బకు నాయుడు కొడుకు కోమాలోనికి వెళ్లిపోతాడు. శివ తనను హైదరాబాద్ తీసుకెళ్లి పెంచమని నాయనమ్మ(కోవై సరళ)ను కోరుతాడు. ఒక మురికివాడలో పెరిగే శివ తాను త్వరగా పెద్దవాడిని కావాలని నాయనమ్మను సలహా అడగ్గా సైకిల్ తొక్కమంటుంది. పెద్దవాడైన శివకు కాలేజిలో సహాధ్యాయులు కొండవలస, ఎం.ఎస్.నారాయణ, ఎల్బీ శ్రీరాంలు. వీరంతా కలసి అమ్మాయిలను సైట్ కొడుతుండగా ఒకరోజు 24 ఏళ్ల ప్రియ(మొనాల్ గుజ్జర్) శివ చేయి తగిలి పుష్పవతి అవుతుంది. ఆమె వెనుకపడే శివకు ప్రియ ఖుషీ చిత్రం తరహాలో తనను చిన్నతనంలోనే టచ్‌చేసిన వాడికే మనసు ఇచ్చేశానంటుంది. అనుకోకుండా శివ టచ్ చేయగానే మెరుపులు రావడంతో ప్రియ సిగ్గిల్లిపోతుంది. తన కుటుంబం సర్వనాశనమయ్యేందుకు కారకులైన శివ ఫ్యామిలీ కోసం తిక్కలనాయుడు దేశదేశాల్లో వెతికిస్తుంటాడు. తమాషా ఏమిటంటే శివ తండ్రి రాజేష్, తల్లి హేమ ఆయన ఇంట్లోనే మాస్కులు వేసుకొని పనివాళ్లలా సెటిలై ఉంటారు. నగరంలో అండర్ వరల్డ్‌లో పనిచేసే డి గ్యాంగుల్లోని ముఖ్యులంతా శివకు ఎదురొచ్చి మరణిస్తారు. శివ – శివ మనోహర్ ఐపిఎస్ అని కమిషనర్(చలపతిరావు) ప్రకటిస్తాడు. డి – గ్యాంగు లీడర్ తన నానమ్మ అని శివ తెలుసుకొంటాడు. పోలీసాఫీసర్‌గా నీ రేంజ్ పెంచనే అలా చేశానంటుంది ఆవిడ. చిత్రం చివరి 18 నిమిషాల్లో 80 చిత్రాల క్లైమాక్స్‌లతో దర్శకుడు అదరగొట్టి సుఖాంతం చేస్తాడు. అంతిమంగా చిత్రం చూసిన ప్రేక్షకులు కుయ్యోమొర్రో అంటూ థియేటర్ల నుంచి బయటపడతారు.



# షెర్లీన్ చోప్రా సంచలనం

షెర్లీన్ చోప్రా... ఈ పేరు వినగానే ఏ ముంబాయి ముద్దుగుమ్మో అనుకొంటాం. అదేమీ కాదు. హైదరాబాద్ అమ్మాయే. మెహదీపట్నంలోని సెయింట్ ఆన్స్ కాలేజిలో చదువుకొంది. తొలినాళ్లలో మిస్ ఆంధ్రాగా ఎంపికై... మోడలింగ్ రంగంలో అడుగు పెట్టింది. ఆ తర్వాత బాలీవుడ్‌కు మకాం మార్చింది. అక్కడ కొన్ని సినిమాల్లో తళుక్కున మెరిసింది. మధ్యలో సమ్‌థింగ్, ఎ ఫిల్మ్‌బై అరవింద్ లాంటి తెలుగు సినిమాల్లోనూ నటించింది. సినిమాలకంటే బిగ్‌బాస్ – 3 కార్యక్రమంతో ఎక్కువ గుర్తింపును సంపాదించింది. ఈ భామ ఇటీవల ప్లే బాయ్ అనే అమెరికా మేగజైన్ ముఖ చిత్రం కోసం నగ్నంగా ఫోజులిచ్చి పెద్ద చర్చనే లేవనెత్తింది. ప్లే బాయ్ కవర్‌పై నగ్నంగా కనిపించనున్న తొలి భారతీయ తార ఈ ముద్దుగుమ్మే కావడం విశేషం. ఈ ప్రచారానికి షెర్లీన్ ఉబ్బితబ్బిబ్బవుతోంది. ఎవరేమనుకొంటే నాకేంటి? నేననుకొన్నది చేశాను. నాకు వచ్చిన గుర్తింపు ఎంతో ఆనందాన్నిస్తోందని సంబరాలు చేసుకొంటోంది.

# సుదీప్‌లో వినమ్రత



ఈగ సినిమా ప్రతినాయకుడిగా నటించిన సుదీప్‌కు ఎంతో పేరును తీసుకొచ్చింది. దీంతో పలువురు తెలుగు, తమిళ నిర్మాతలు తమ చిత్రాల్లో నటించమని ఆయన్ను అడుగుతున్నారు. కానీ ఈ డిమాండ్‌ను సుదీప్ క్యాష్ చేసుకోవాలనుకోవడం లేదు. ఈ విషయమై మాట్లాడుతూ నేనేదీ కావాలనుకోలేదు. అనుకోకుండానే నటుడ్ని అయ్యాను. దేవుడు మన కోసం ఏదో ఒకటి రాసిపెట్టి ఉంటాడని నమ్ముతాను. నాకంటూ సొంత ప్రణాళికలు ఏమీ లేవు. నా దగ్గరకు వచ్చిన సినిమాల్ని చేసుకొంటూ పోవడం తప్ప, ప్రస్తుతానికి దర్శకుడిగా ఏ సినిమా చేయట్లేదు. ఎందుకంటే పది నెలలు ఒక్కో సినిమాకు వెచ్చించాల్సి ఉంటుంది. అంత సమయం ఇప్పుడు నా దగ్గర లేదు. ప్రస్తుతం హీరోగానే కొనసాగిపోతానన్నా రా యన.

# పాత ప్రియునికి చేరువగా నయన?



హీరోయిన్ నయనతార ఒకనాటి తన ప్రేమికుడు శింబుకు చేరువౌతుంది. శింబు మాటలు ఈ విషయాన్ని ధ్రువీకరిస్తున్నాయని చెన్నైలో కోడైకూస్తుంది. శింబు మాట్లాడుతూ నయనతార మనసున్న మనిషి. ఆమె, నేను మంచి స్నేహితులం. దానికి రొమాంటిక్ అంటూ వేరే కలర్ ఇవ్వడంలో అర్థం లేదు. అనవసర విషయాల గూర్చి మాట్లాడడం నాకు ఇష్టం లేదు. మా జీవితాల్లో ఎలాంటి చేదు అనుభవాలులేవని చెప్పుకొచ్చాడు. నయన ఈ వ్యవహారాలపై స్పందిస్తూ నా జీవితంలో అనుకోనివిధంగా పలు సంఘటనలు చోటుచేసుకొన్నాయి. అవన్నీ నన్ను మరింత ధృడమైన వ్యక్తిగా తీర్చిదిద్దాయి. ఈ సారి జీవితంలో స్థిరపడిపోతానని తెలివిగా మాట్లాడింది.



# పెళ్లంటే కొంచెం ద్వేషం!

హీరోయిన్ ఇలియానా నటించిన జులాయి, దేవుడు చేసిన మనుషులు, బర్ఫీ చిత్రాలు ఒకదాని తర్వాత ఒకటి విడుదలైపోయాయి. కాస్త బరువు తగ్గిన ఇలియానా కొత్త సినిమాల కోసం ఎదురు చూస్తుంది. ఇటీవల హైదరాబాద్ వచ్చిన ఆమెను పెళ్లెప్పుడు అంటే సమాధానంగా పెళ్లికి మూడు అంశాలు అనుకూలించాలి. పరస్పర గౌరవం, నమ్మకం, ప్రేమ ఉన్నప్పుడే ఆ బంధం శాశ్వతంగా నిలబడుతుందని నా నమ్మకం. పెళ్లంటే సమాజం బలవంతంగా రుద్దిన సాంప్రదాయం అనిపిస్తుంటుంది. అలాగని పెళ్లంటే ద్వేషం లేదు. ఎప్పుడోకప్పుడు పెళ్లి చేసుకొంటాను. కానీ అదంతా చుట్టుప్రక్కల వారికోసమేనని విసుగ్గా అంది. పెళ్లి చేసుకోకుండా హీరోయిన్‌గా కొనసాగాలని ఇలియానా తలపోస్తున్నట్లుంది.

# ఆ టెండర్లు తెరవండి!

• డాక్టర్ అనిల్‌కుమార్ యాదవ్ డిమాండ్



నెల్లూరు నగర పరిధిలో రోడ్లు భవనాల శాఖ ఇటీవల పిలిచిన టెండర్ల విషయంలో ఆనం బ్రదర్స్ ఒత్తిడికి తలొగ్గకుండా ఎస్ఇ స్పందించి క్వాలిఫై అయిన కాంట్రాక్టర్లను పరిగణనలోనికి తీసుకొని ప్రైస్ బిడ్స్‌ని ఓపెన్ చేయాలని వైకాపా నేత పోలుబోయిన అనిల్‌కుమార్ డిమాండ్ చేశారు. 24వ తేది ఈ వ్యవహారమై రోడ్లు, భవనాల శాఖ ఎస్ఇకి వినతిపత్రం ఇచ్చారు. అనంతరం విలేకరులతో మాట్లాడుతూ 100 కోట్ల రూపాయల మేర పనులు నెల్లూరు, ఆత్మకూరు, పొదలకూరులలో చేపట్టను టెండర్లు పిలిచారని నగర పరిధిలో కొంత మంది అర్హత ఉన్న కాంట్రాక్టర్లను పక్కనపెట్టి ప్రజాప్రతినిధుల ఒత్తిడితో ఒక కాంట్రాక్టర్‌కు 4.9 శాతం ఎక్సెస్‌కి టెండర్లు ఇచ్చినట్లు తమ దృష్టికి వచ్చిందన్నారు. ఇలా చేయడం అధికారులకు తగదన్నారు. అదే జరిగితే వైకాపా తరపున లోకాయుక్తకు పూర్తి ఆధారాలతో ఫిర్యాదు చేస్తామన్నారు. ఈ కార్యక్రమంలో ముక్కాల ద్వారకానాథ్, సంక్రాంతి కళ్యాణ్, పులిమి శైలజ తదితరులు పాల్గొన్నారు.

## • అడంగళ్లను కంప్యూటరీకరించండి!

జిల్లాలోని భూములకు సంబంధించిన 19 లక్షల అడంగళ్ల వివరాలను కంప్యూటరీకరించాలని అదనపు జాయింట్ కలెక్టర్ లక్ష్మీకాంతం సూచించారు. 24వ తేది కలెక్టర్ కార్యాలయంలోని కాన్ఫరెన్స్ హాల్‌లో నిర్వహించిన తహశీల్దార్ల సమీక్షా సమావేశంలో ఆయన మాట్లాడుతూ జిల్లాలో సర్వే నెంబర్ల వారీగా 19 లక్షల అడంగళ్లు ఉండాలన్నారు. వీటిలో

### అదనపు జెసి ఆదేశం

ఇప్పటివరకు 11 లక్షల అడంగళ్లను కంప్యూటరీకరించామని మిగతా వాటిని కూడా త్వరితగతిన పూర్తి చేయాలని సూచించారు. కొత్తగా భూములు కొన్నవారి వివరాలు కూడా మరో నాలుగు వేల వరకు ఉన్నాయన్నారు. వాటిని స్వల్పమార్పుల అనంతరం కంప్యూటరీకరిస్తామన్నారు. అర్హత కలిగిన రైతులందరికీ రుణాలిచ్చేందుకు అర్హత కార్డులివ్వాలని ఆదేశించారు. జిల్లాలో అర్హులైన పేదలకు పొజిషన్ సర్టిఫికేట్లు కేటాయించాలని సూచించారు.

# అదనపు జెసిపై పని భారం!

## గందరగోళంలో ఏ పనీ చేయలేకున్నాడు



జిల్లా అదనపు జాయింట్ కలెక్టర్ బి.లక్ష్మీకాంతంపై పనిభారం పడింది. జిల్లా జాయింట్ కలెక్టర్ సౌరభ్‌గౌర్‌ను గత నెలలో ప్రభుత్వం బదలీ చేయడంతో అదనపు జెసి ఇన్‌ఛార్జ్‌గా వ్యవహరిస్తున్నారు. అదనపు జాయింట్ కలెక్టర్‌గా వివిధ సంక్షేమ శాఖల పనితీరును సమీక్షించాల్సి ఉంటుంది. అలాగే నెల్లూరు మునిసిపల్ కార్పొరేషన్ ప్రత్యేకాధికారిగా కూడా కొనసాగుతున్నారు. వీటికి తోడు ఇన్‌ఛార్జ్ జాయింట్ కలెక్టర్ హోదాలో రెవిన్యూ శాఖ పనితీరుపై సమీక్షా సమావేశాలు జరుపుతున్నారు. ఒకేసారి అన్ని శాఖల పనితీరును పర్యవేక్షించాల్సి రావడంతో ఆయన కొంతమేర పనిఒత్తిడికి గురవుతున్నారని కలెక్టరేట్ ఉద్యోగులు వ్యాఖ్యానిస్తున్నారు. ఒక్క మునిసిపల్ కార్పొరేషన్ చక్కదిద్దేందుకే రోజంతా కేటాయించాల్సిన పరిస్థితి ఏర్పడింది. ఇతర శాఖలను సైతం పర్యవేక్షించి సమావేశాలు నిర్వహించడం కష్టతరంగా మారింది. దీంతో ఆయన విధినిర్వహణపై సరైన దృష్టి సారించలేక పోతున్నారని చెబుతున్నారు. ఇటీవల సంక్షేమ శాఖల పనితీరు అధ్వాన్నంగా తయారైంది. ఈ శాఖల ఉన్నతాధికారులు ప్రజలకు అందుబాటులో లేకుండా పోతున్నారు. రాష్ట్ర ప్రభుత్వం నుంచి విడుదల కావాల్సిన నిధులు సకాలంలో విడుదల కాకపోవడంతో ప్రజలకు సమాధానం చెప్పలేక క్యాంపుకు వెళుతున్నట్లు సమాచారం. ఏదిఏమైనా అదనపు జెసిపై పనిభారం తగ్గిస్తే సంక్షేమ శాఖల పనితీరుపై దృష్టి సారించే అవకాశం ఉంటుంది.



# వాకాటి – బీద వాగ్వివాదం

## • సమీక్షా మండలి సమావేశంలో పదనిసలు

జిల్లా సమీక్షా సమావేశంలో కావలి ఎమ్మెల్యే బీద మస్తాన్‌రావు, ఎమ్మెల్సీ వాకాటి నారాయణరెడ్డిల మధ్య వాగ్వివాదం చోటుచేసుకొంది. సమావేశంలో ఉదయగిరి ఎమ్మెల్యే మేకపాటి చంద్రశేఖర్‌రెడ్డి దివంగత ముఖ్యమంత్రి వైఎస్ రాజశేఖర్‌రెడ్డిని "రైతు బాంధవుడు" అని పొగుడుతూ జలయజ్ఞం పనులు ప్రారంభించాడని పేర్కొన్నారు. కావలి కాలువ కింద ఉదయగిరి, కావలి నియోజకవర్గాలకు సంబంధించిన ఆయకట్టు ఉందని రైతు బాంధవుడిగా పేర్కొన్న వైఎస్ రాజశేఖర్‌రెడ్డి ఒక రూపాయి కూడా తమ నియోజకవర్గానికి విడుదల చేయలేదని బీద మస్తాన్‌రావు వ్యాఖ్యానించారు. దీంతో ఆయన వెనుకనే కూర్చున్న ఎమ్మెల్సీ వాకాటి నారాయణరెడ్డి కల్పించుకుని అజెండాలోని అంశాల గురించి చర్చించాలే తప్ప వ్యక్తుల గురించి కాదని అన్నారు. దీంతో ఇరువురి మధ్య వాగ్వివాదం మొదలైంది. వాకాటి ఆగ్రహం వ్యక్తం చేస్తూ మర్యాదగా మాట్లాడు జాగ్రత్త అనగా, నువ్వు మర్యాదగా మాట్లాడు అంటూ బీద మస్తాన్‌రావు అన్నారు. సమస్య ప్రక్కదారి పడుతుందని గ్రహించిన తెలుగుదేశం ఎమ్మెల్యేలు ఇద్దరినీ శాంతింపజేసి సమావేశాన్ని కొనసాగించారు.

# ఇంగ్లీషులో అజెండా!

## మాతృభాషను మరచిన అధికారులు



DISTRICT REVIEW COMMITTEE MEETING

SPSR NELLORE DISTRICT

AGENDA

Venue:
Z.P. Meeting Hall,
Nellore

రాష్ట్రంలోని అన్ని ప్రభుత్వ శాఖల కార్యాలయాల్లో తెలుగు భాష కచ్చితంగా అమలు చేయాలన్నది ప్రభుత్వ సంకల్పం. వివిధ సమస్యలపై ప్రజల నుంచి స్వీకరించే వినతిపత్రాలలో కూడా తెలుగులో రాసిన వాటికి మొదటి ప్రాధాన్యతనిస్తామని అధికారులు ప్రకటిస్తుంటారు. కేంద్ర ప్రభుత్వానికి, ఇతర రాష్ట్రాలకు జరిపే ఉత్తర ప్రత్యుత్తరాలకు మినహా మిగతా అన్ని అంశాలకు సంబంధించి తెలుగులోనే ప్రత్యుత్తరాలు జరపాలని ప్రభుత్వం ఆదేశించి ఉంది. అయితే ఈ నెల 25వ తేది జరిగిన జిల్లా సమీక్షా సమావేశానికి రూపొందించిన అజెండాను మొత్తం ఆంగ్లంలోనే ముద్రించడం చర్చనీయాంశంగా మారింది. ఇంతకు ముందు నిర్వహించిన డిఆర్సీ సమావేశాల్లో తెలుగులోనే అజెండా రూపొందించడం జరిగింది. 14 శాఖలకు సంబంధించిన అంశాలను ఆంగ్లంలో తయారు చేయడంతో కొందరు ప్రజాప్రతినిధులు అవగాహన చేసుకోలేక పోయారు. ఇన్‌ఛార్జి మంత్రి, జిల్లాకు చెందిన మంత్రి, జిల్లా కలెక్టర్‌తో సహా ఏ ఒక్కరు కూడా అధికార భాష గురించి మాట్లాడక పోవడం విశేషం.

# కల్తీ కల్లుపై ఎక్సైజ్ నిఘా

జిల్లావ్యాప్తంగా కల్లును కల్తీ చేయకుండా ఎక్సైజ్ శాఖ నిఘా ఉంటుంది. ఇటీవల రాష్ట్రంలోని కొన్ని జిల్లాల్లో కల్తీ కల్లు తాగినవారు అస్వస్థతకు గురైన సంగతి తెలిసిందే. జిల్లాలో కూడా కల్లును కల్తీ చేస్తున్నారన్న సమాచారంతో కల్లు దుకాణాలపై నిఘా ఏర్పాటు చేశారు. వాస్తవంగా చెట్టు నుంచి దింపిన కల్లును సేవిస్తే ఎటువంటి హానీ ఉండదు. కల్లుప్రియులను ఆకట్టుకొనేందుకు కొందరు కల్లు దుకాణదారులు మత్తెక్కించే కొన్ని రసాయన పదార్థాలు కల్లులో కలుపుతుంటారు. ఇలా కల్తీ చేయబడిన కల్లును సేవించిన వారు కొద్ది సేపటికి మత్తులోకి జారుకుంటారు. మరికొందరు కల్లుగీత కార్మికుల నుంచి క్యాన్ల ద్వారా కల్లును కొనుగోలు చేసి విక్రయాలు సాగిస్తున్నారు. గీత కార్మికులకంటే బయట వ్యాపారులే ఎక్కువ శాతం కల్తీ చేస్తుంటారు. సంబంధిత ఎక్సైజ్ పోలీస్ స్టేషన్ సిబ్బంది వ్యాపారులతో సన్నిహిత సంబంధాలు కలిగి ప్రతినెల మామూళ్లు స్వీకరిస్తూ కల్తీ గురించి పట్టించుకోవడం లేదన్న

## ఫలితమెలా ఉంటుందో?

ఆరోపణలు ఉన్నాయి. ఇప్పటికే మద్యం విక్రయాలకు సంబంధించి అనేక ఆరోపణలు మూటగట్టుకున్న ఎక్సైజ్ శాఖ కల్తీ కల్లు విషయంలో ఆరోపణలు రాకుండా ఉండేందుకు గట్టి చర్యలు తీసుకుంటామన్నారు. ఎక్సైజ్ శాఖ ఏర్పాటుచేసిన నిఘా ఏ మేరకు ఫలితమిస్తుందో వేచి చూడాలి.

# వివేకా అబద్ధాల పుట్ట!

## తెలుగు నేతల విమర్శ

అవినీతి పరులు, అక్రమార్కులకు అండదండలందిస్తూ రూరల్ శాసన సభ్యుడు ఆనం వివేకానంద రెడ్డి ప్రజాధనాన్ని దోచుక తింటున్నాడని తెలుగుదేశం పార్టీ విమర్శించింది. టిడిపి జిల్లా కార్యాలయం ఎన్టీఆర్ భవన్‌లో రూరల్ నియోజకవర్గ ఇన్‌ఛార్జ్ కిలారి వెంకటస్వామినాయుడు, కోటంరెడ్డి శ్రీనివాసులురెడ్డి విలేకరుల సమావేశం నిర్వహించారు. పేదలకు గూడు కల్పించాలన్న ఉద్దేశంతో ప్రభుత్వం ఇందిరమ్మ ఇళ్ల పథకాన్ని ఏర్పాటుచేస్తే దానిని అడ్డం పెట్టుకొని వివేకానందరెడ్డి అనుచరులు, మాజీ కార్పొరేటర్లు దోపిడీకి పాల్పడ్డారన్నారు. అవినీతికి పాల్పడి నాసిరకంగా ఇళ్ల నిర్మాణాలు చేపట్టడంతో అవి కూలిపోతున్నాయన్నారు. ఇటీవల కొత్తూరు ఇందిరమ్మ ఇళ్లలో ఒక ఇంటి శ్లాబ్ కూలిపోవడం ఇందుకు నిదర్శనం అన్నారు. ఇళ్ల నిర్మాణాల్లో జరిగిన అవినీతి అడుగడుగునా కన్పిస్తున్నా, వివేకానందరెడ్డి మాత్రం ఇంటికి ప్లాస్టరింగ్ చేయకపోవడం వల్లనే పగుళ్లొచ్చి, కూలిపోయాయని చెప్పడాన్ని తీవ్రంగా ఖండించారు. పేద ప్రజలకు జరిగిన అన్యాయానికి బాధ్యత వహించాల్సిందిపోయి అవినీతిపరులైన కాంట్రాక్టర్లను వెనకేసుకొని రావడంలో ఆంతర్యం ఏమిటని ప్రశ్నించారు. దాదాపు 23 కోట్ల రూపాయల అవినీతి కొత్తూరు ఇందిరమ్మ ఇళ్ల నిర్మాణంలో జరిగిందని ఆరోపించారు.

## అంటిన బొగ్గు మసి!

16వ పేజీ కొరవ

విదేశీ కంపెనీలకు తెగనమ్మి, సొమ్ము చేసుకొనే కుట్రలు ఫలించలేదు.

ఈలోగా వీటిపై కంట్రోలర్ అండ్ ఆడిటర్ జనరల్ వినోద్ రాయ్ కళ్లు పడ్డాయి. టిఎన్.శేషన్ వచ్చిన తర్వాత ఎలక్షన్ కమిషన్ రాజకీయవాదులకు సింహస్వప్నంగా మారినట్లే, వినోద్‌రాయ్ రాకతో ఆడిట్ సంస్థ కూడా ప్రభుత్వాల వెన్నులో చలి పుట్టించడం మొదలైంది. అంతకు క్రితం ఆడిట్ రిపోర్టు పార్లమెంట్ లైబ్రరీలో చెత్త పుస్తకాలుగా మాత్రమే పడి వుండేవి. వినోద్‌రాయ్ ఆడిట్ నిర్వహణలో కొత్త పుంతలు తొక్కాడు. ప్రభుత్వ లెక్కలు మాత్రమే కాకుండా, విధానాల పరంగా చేసే దుర్మార్గాలను సైతం వెలుగులోకి తేవడం మొదలు పెట్టాడు. 2జి స్పెక్ట్రం కుంభకోణం ఆయన వల్లనే బయటపడింది. ఇప్పుడు బొగ్గు గనుల దారుణాన్ని ప్రజల దృష్టికి తెచ్చాడు. టెండర్లు, వేలం పద్ధతులు లేకుండా కేవలం తమకు నచ్చిన వారికి గనులు కేటాయించడం వల్ల ప్రభుత్వానికి జరిగిన నష్టం దాదాపు లక్షా 86వేల కోట్లని లెక్క తేల్చాడు వినోద్ రాయ్.

## కళ్లకు కట్టిన ఆడిటర్ జనరల్

గనుల కేటాయింపు జరిగిన పద్ధతి ప్రభుత్వ విధానాలకు ఎంత విరుద్ధంగా వుందో కళ్లకు కట్టాడు ఆడిటర్ జనరల్. గాలికి పోయే పేలపిండి రామార్పణం అన్నంత అలుసుగా జరిగింది ఈ కేటాయింపు. మొదటగా ప్రభుత్వం బొగ్గు గనుల జాబితా తయారు చేసింది. ఆ జాబితాను పత్రికలలో ప్రకటించి, ఆసక్తి వుండే వాళ్లు దరఖాస్తు చేసుకోవచ్చని ఆహ్వానించింది. దాదాపు 200 మంది దరఖాస్తు చేసుకొన్నారు. తమకు బొగ్గు ఎందుకు కావాలో, దాన్ని ఎప్పుడు త్రవ్వి తీస్తామో, దానితో ఏ పరిశ్రమ పెడతామో మాత్రమే ఆ దరఖాస్తులో పేర్కొన్నారు. ఆ దరఖాస్తులను బొగ్గు శాఖ కార్యదర్శి నేతృత్వంలోని కార్యదర్శుల కమిటీ పరిశీలించి, బొగ్గు గనులున్న రాష్ట్రాలకు ఒక మాట చెప్పి, కేటాయింపు జరిపేసింది. 155 బొగ్గు గనులను ఇట్లా ఉచితంగా ఇచ్చి పారేశారు. ఎన్టీపిసి, ఎంఎంటిసి వంటి ప్రభుత్వ రంగ సంస్థలు కొద్ది సంఖ్యలో మాత్రమే ఈ కేటాయింపులు పొందాయి. రిలయన్స్, టాటాలు, జిందాల్స్, భూషణ్ స్టీల్స్, ఎలక్ట్రో స్టీల్ వంటి కొద్ది సంఖ్యలో పేరున్న కార్పొరేట్ కంపెనీలకు గనులు దక్కాయి. తతిమావన్నీ వూరు పేరు లేని అనామక వ్యక్తులు స్వంతం చేసుకొన్నారు. కేంద్రంలోని ఏదో ఒక మంత్రిని ఆశ్రయించి, గనులు దక్కించుకొన్నారు. కేంద్రమంత్రి సుభోద్‌కాంత్ సహాయ్ అయితే నేరుగా ప్రధానికే జాబు వ్రాశాడు, తనకు సంబంధించిన రెండు కంపెనీలకు గనులు కేటాయించడంలో మీరు వ్యక్తిగతంగా జోక్యం చేసుకొని, కార్యదర్శులకు చెప్పి, ఇప్పించాలని. ఇటువంటి వ్యక్తిగత ప్రయోజనాలకు దూరంగా వుంటాడని భావించే మన్మోహన్‌సింగ్ విచిత్రంగా ఈ మంత్రి గారి జాబు మీద వెంటనే స్పందన చూపి, కార్యదర్శులకు సిఫార్సు చేశాడు. ప్రధాని స్థాయిలో సిఫార్సు వస్తే ఏ కార్యదర్శి కాదనగలడు?

## దేశం నష్టపోయింది

గనుల కేటాయింపులో ఈ లాలూచీ వ్యవహారాల వల్ల విలువైన జాతీయ సంపద అక్రమంగా ప్రైవేటు వ్యక్తుల పరమైంది. దరఖాస్తులో పేర్కొన్నట్లు వీరెవరూ బొగ్గు త్రవ్వలేదు. దాని ఆధారంగా పరిశ్రమలూ పెట్టలేదు. తమకు దక్కిన కేటాయింపులను బొగ్గు అవసరం వుండే పరిశ్రమలకు అమ్ముకొని, వేల కోట్ల రూపాయల లాభం ఆర్జించారు. బొగ్గు లభ్యత పెంచితే విద్యుత్, సిమెంట్, స్టీలు వంటి పరిశ్రమలు త్వరితగతిన నెలకొంటాయన్నది ఈ కేటాయింపుల ఉద్దేశం. కానీ అది ఏ కొంచెం కూడా నెరవేరలేదు. ఆ గనులను వేలానికి పెట్టి వుంటే, రాయల్టీ రూపంలో ప్రభుత్వానికి లక్షల కోట్ల రూపాయల రాబడి వచ్చి వుండేది. ప్రజల ఆస్తులు ప్రజలకు ఉపయోగపడి వుండేవి. అత్త సొత్తు అల్లుడు దానం చేసినట్లు, అడిగిన వారికంతా గనులు ఇవ్వడం వల్ల దేశం చాలా రూపాలలో నష్టపోయింది. రాయల్టీ రాబడి లేదు. కొత్త పరిశ్రమలు రాలేదు. ఉన్న వనరులు ఖాళీ అయిపోయాయి. ఎపి జెన్‌కో వంటి ప్రభుత్వ రంగ సంస్థలు విద్యుత్ ఉత్పత్తి పెంచుకోవడానికి బొగ్గు లేని పరిస్థితి.

ఆర్థిక సంస్కరణల మైకం క్రమ్మిన మన్మోహన్ సింగ్ చేసిన విధాన లోపం వల్ల దేశానికి, జాతి సంపదకు, ప్రజలకు ఇంత నష్టం జరిగితే, ఆడిటర్ జనరల్ పుణ్యాన అది వెలుగులోకి వస్తే, జరిగిన తప్పుకు క్షమాపణ చెప్పి, చెంపలేసుకొని, తప్పు సరిదిద్దుకోవాల్సిన ప్రధాని, కాంగ్రెస్ పార్టీ ఇదంతా ప్రతిపక్షాల బ్లాక్ మెయిల్ రాజకీయం అని కొట్టి పారేస్తున్నాయి. గత రెండు వారాలుగా పార్లమెంట్ స్తంభించిపోయినా పట్టించుకోవడం లేదు.

## గబ్బు పట్టిన పోలీసు శాఖ

మొదటి పేజీ కొరవ

వలసింది ఏదీ లేదు. బదలీ ఉత్తర్వులు పొందిన ప్రతి సర్కిల్ ఇన్స్‌పెక్టర్ కూడా ఐదు నుంచి పదిహేను లక్షల వరకు సమర్పించుకొనే, ఉత్తర్వు కాగితం చేతికి తీసుకొన్నారన్నది జగమెరిగిన సత్యం. జాతీయ రహదారి మీద వుండే పోలీసు స్టేషన్ల విలువ 15 లక్షలట. నెల్లూరు నగరం అయితే పది లక్షలు. మిగతా వాటి రేటు ఐదు లక్షలు. సూళ్లూరుపేటలో పని చేస్తుండిన హనుమంతరావనే అధికారి ఏడా దిన్నర క్రితమే పెద్ద మొత్తం చెల్లించి పోస్టింగ్ తెచ్చుకొన్నాడు. అప్పట్లోనే దానిపై స్థానిక ఎమ్మెల్సీ వాకాటి నారాయణరెడ్డి అభ్యంతరం చెప్పాడు. ముఖ్యమంత్రి వరకు అన్ని స్థాయిలలో ఫిర్యాదు కూడా చేశాడు. కానీ అప్పుడాయన గోడు ఎవరూ విన్పించుకోలేదు. ఇప్పుడా సిఐని గుంటూరుకు బదలీ చేశారు. కొత్తగా గుంటూరు నుంచి నరసింహరావనే అధికారిని నియమించారు.

నెల్లూరులో త్రీ టౌన్, సిక్స్ టౌన్ స్టేషన్లను అప్‌గ్రేడ్ చేసి మరీ ఇద్దరు సిఐలను నియమించారు. వాటికి స్థానిక ఎమ్మెల్యే ఆనం వివేకానంద రెడ్డి అభ్యంతరం చెప్పాడట. కానీ ఆయన మాట కంటే తనకొచ్చే మూటే ముఖ్యమనుకొన్నాడు ఐజి గారు. వివేకా అలగకుండా నెల్లూరు వన్, టూ, ఫోర్త్ టౌన్ పోలీసు స్టేషన్లకు ఆయన సిఫార్సు చేసిన వారిని నియమించారట. వెంకటగిరి ఎమ్మెల్యే రామకృష్ణ ఫిర్యాదు మీద అక్కడి సిఐ షేక్ అబ్దుల్ కరీంను నెల్లూరు ఫోర్త్ టౌన్‌కు బదలీ చేశారు. మొత్తం మీద మన జిల్లాలో 18 బదలీలు జరిగాయి. ఇప్పుడు వీటన్నిటినీ నిలిపివేశాడు డిజిపి గారు. అంతంత మొత్తాలు లంచంగా సమర్పించుకొన్న తర్వాత బదలీలు ఆగి పోవడంతో సంబంధిత అధికారులు లబోదిబో మంటున్నారు. ఇచ్చిన డబ్బు తిరిగి రాదు. విచారణలో ఆరోపణలకు రుజువు దొరకడం ఖాయం కాబట్టి కోరుకొన్న చోట పోస్టింగ్ దొరకదు. బదలీ కోసం మళ్లీ ఎమ్మెల్యేలు, మంత్రుల ఇళ్ల ముందు కుక్క కాపలా కాయక తప్పదు.

దినేష్‌రెడ్డి గారు డిఎస్పీ స్థాయి అధికారుల బదలీల విషయంలో మంత్రుల సిఫార్సులను ఖాతరు చేయకూడదన్న నిర్ణయం తీసుకొని, రాష్ట్ర పోలీసు శాఖలోనే ఒక కొత్త అధ్యాయానికి శ్రీకారం చుట్టారు. హైదరాబాదు నగరంలో, కోటి రూపాయల వరకు రేటు పలికే పంజాగుట్ట వంటి చోట్ల కూడా తనకు నచ్చిన అధికారులను నియమించాడు. ఆ నూతన పోకడకు ముఖ్యమంత్రి నుంచి సైతం మద్దతు రావడం గమనార్హం. అదే పోకడను జిల్లాలకు కూడా వర్తింప చేస్తే తప్ప ఇటువంటి అరాచకాలకు స్వస్తి వాచకం పడదు. తమ సిఫార్సు లేఖ వుంటేనే బదలీలనే అహంకారంతో ఎమ్మెల్యేలు, మంత్రులు జిల్లాలలో పోలీసు యంత్రాంగాన్ని నిర్వీర్యం చేస్తున్నారు. దాని వల్ల పోలీసు పరువు పోవడమే కాదు, పూర్తిగా రాజకీయ మయమై, ప్రజల విశ్వాసం కోల్పోతున్నది. దినేష్‌రెడ్డి గారు తన హయాంలోనే ఈ దుష్ట సాంప్రదాయానికి ముగింపు పలికితే ఆయన పేరు పోలీసు శాఖలో చాలాకాలం నిలిచిపోతుంది.

## ఆయన పని చేయడు...

మొదటి పేజీ కొరవ

కుంభకోణం మకిలిని ఇప్పటికే రుద్దివున్నారు. జానారెడ్డి విషయంలో కూడా చాలా అవినీతి ఆరోపణలు అందాయి అధిష్ఠానం పెద్దలకు. దానికి తోడు జానారెడ్డి మాటలు ఎవరికీ అర్థం కావని, ఆయన్ను ముఖ్యమంత్రిగా నియమిస్తే ప్రజలలో పరువు పోతుందని చెప్పారట. దామోదర రాజనర్సింహను కూడా వదలి పెట్టలేదు. ఆయన సాయంత్రమైతే ఎవరికీ దొరకడని, ఇంట్లో మందు విందులతో పొద్దుపుచ్చుతాడని, ముఖ్యమంత్రి వంటి బాధ్యతాయుతమైన పదవిని నిర్వహించే స్థాయి లేదని అధిష్టానం చెవిలో వూదారట. రాత్రి సమయంలో దామోదర రాజనర్సింహ మందు విందులో వున్న ఫోటోలను కూడా అందజేశారట.

ఇట్లా ఒక్కొక్కరి మీద ఒక్కొక్క రకమైన ఆరోపణ చేసి, అందుకు తగిన ఆధారాలు అందజేసి, అధిష్టానాన్ని అయోమయంలో ముంచేశాడు కిరణ్ కుమార్‌రెడ్డి. దానితో ఆంధ్ర వ్యవహారాలంటేనే చీకాకు పడే పరిస్థితి కల్గింది ఢిల్లీలో. ఇటీవల తనను కలవడానికి వచ్చిన కావూరి సాంబశివ రావు, హిందు దినపత్రికకు చెందిన ఒక సీనియర్ విలేకరితో అహ్మద్ పటేల్ నేరుగానే ఈ విషయాలు చెప్పినట్లు తెలుస్తున్నది. ఆంధ్ర గురించి ఆలోచించినా, ఆలోచన వదిలేసినా తల పోటు వస్తున్నదని వాపోయాడట అహ్మద్ పటేల్.

తాత్కాలికంగా పదవి నిలుపుకొన్న కిరణ్ కుమార్‌రెడ్డి ముఖ్యమంత్రిగా తన బాధ్యతలు నిర్వహిస్తే మార్పు ఆలోచన అవసరం వుండదు. కానీ ఎందువల్లనో ఆయన రాష్ట్రాన్ని కలచి వేస్తున్న ఏ సమస్య మీద కూడా కనీసపాటి శ్రద్ధ పెట్టడం లేదు. పాలనపై సమయం వెచ్చించడం లేదు. దానితో రాష్ట్రంలో పరిపాలన కుంటి నడక నడుస్తున్నది.

## నెల్లూరుముచ్చట్లు

3వ పేజీ కొరవ

మౌలానా అజీజ్, రియాజ్, ఇలియాజ్, బాషా, మహమ్మద్ రఫీ తదితరులు పాల్గొన్నారు.

## ఉమ్మారెడ్డిగుంటలో మధుర మీనాక్షమ్మ!

నెల్లూరు ఉమ్మారెడ్డిగుంటలో వెలసిన శ్రీమహాగణపతి మధుర మీనాక్షమ్మ దేవస్థానంలో శ్రావణ మాస సందర్భంగా చందనాలంకారం, లక్షమల్లె పూలతో పూజ చేశారు. పోలాల అమావాస్య సందర్భంగా ఉదయం అష్టోత్తర, శతాభిషేకం, సాయంత్రం శాకాంబరి అలంకారం, సహస్ర కుంకుమార్చనలు బండారు రాధాకృష్ణశర్మ ఆధ్వర్యంలో జరిగాయి. ఆలయ కమిటీ నిర్వాహకులు ఖాదర్ బాష, పి.పుట్టయ్య, వెంకయ్య, పి.శ్రీనివాసులు, సురేష్ తదితరులు ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు.

## నర్తన కేసులో ఐదేళ్లు జైలు శిక్ష

నర్తన అనే చిన్నారిని హింసించిన కేసులో ఆమె తల్లి నాగచైతన్య, ప్రియుడు నగేష్‌బాబుకు ఐదేళ్ల జైలు శిక్ష, ఒక్కొక్కరికి 36వేల జరిమానా విధిస్తూ సంచలనాత్మక తీర్పునిచ్చింది జిల్లా సెషన్సు కోర్టు. భర్తను వదిలేసి ఉంటున్న ఆమె స్థానికంగా పాఠశాల నిర్వహించే నగేష్‌బాబుతో అక్రమ సంబంధం పెట్టుకొంది. తన అక్రమ సంబంధానికి అడ్డంగా ఉందని భావించి కూతురైన నర్తనను ప్రియుడితో కలసి హింసించింది. ఈ ఘటన రాష్ట్రవ్యాప్తంగా సంచలనం సృష్టించడం తెలిసిందే. దీనిపై కోర్టులో కేసు నడిచిన తర్వాత తల్లి అనే పదానికే మాయని మచ్చగా మారిన చైతన్య, ఆమె ప్రియుడు నగేష్ బాబుకు ఐదేళ్ల శిక్ష, జరిమానా విధిస్తూ కోర్టు తీర్పు చెప్పింది. జరిమానాలోని 70వేల రూపాయలు నర్తన పేరున డిపాజిట్ చేయాలని తీర్పులో పేర్కొంది.

## గూడూరు సబ్ కలెక్టర్‌గా నివాస్

గూడూరు కొత్త సబ్ కలెక్టర్‌గా జనార్ధన్ నివాస్ బాధ్యతలు చేపట్టారు. 2010 ఐఏఎస్ బ్యాచ్‌కు చెందిన నివాస్ తూర్పుగోదావరి జిల్లాలో ట్రైనీ సబ్ కలెక్టర్‌గా పనిచేస్తూ ఇక్కడకు వచ్చారు. ఆగష్టు 28వ తేదీ గూడూరు సబ్ కలెక్టర్‌గా బాధ్యతలు చేపట్టిన అనంతరం ఆయన మాట్లాడుతూ ప్రజా సమస్యల పరిష్కారంలో ముందుంటానని, వీలైనంత మేర సేవచేస్తానని తెలిపారు. పలువురు అధికారులు ఆయన్ను కలసి అభినందించారు.

## గురుజాడ అప్పారావు 150వ జయంతి

ఆధునిక సాహిత్యానికి అడుగుజాడ గురజాడ అప్పారావు 150వ జయంతి సభ 8తేదీ సాయంత్రం టౌన్‌హాల్‌లో జరుగుతుంది. డికెడబ్ల్యు కాలేజీ మాజీ ప్రిన్సిపల్ కె.శోభాదేవి అధ్యక్షతన జరిగే సభలో విజయనగరం మహారాజ కళాశాల విశ్రాంత తెలుగుశాఖాధ్యక్షులు యు.ఏ.నరసింహమూర్తి ప్రధాన వక్త. విశిష్ట అతిథిగా శాసన మండలి సభ్యుడు విఠపు బాలసుబ్రహ్మణ్యం విచ్చేస్తారు.

## జనవాణి

2వ పేజీ కొరవ

మంత్రి మోపిదేవి వెంకటరమణతో మొదలైన మంత్రుల జైలుపర్వం ఎక్కడికి వెళ్లి ఆగుతుందో? ఈ వ్యవహారంలో నిజాయితీగా విచారణ చేస్తున్న సిబిఐ జెడి లక్ష్మీనారాయణ, ఎసిబి చీఫ్ ప్రసాద రావును అభినందించకుండా వుండలేం.

ఎమ్వీ రమణయ్య కావలి

## పదరంగం -31

నిర్వహణ : బాబాజీ

| | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | | 2 | | | 3 | 4 | 5 | 6 | | 7 |
| 8 | | | | | 9 | | | | | |
| | | 10 | | | | | | 11 | 12 | |
| 13 | | | | | 14 | | | | | |
| | | 15 | | | | | | 16 | | |
| | 17 | | | | | 18 | | | | |
| 19 | | | | 20 | 21 | | | 22 | | 23 |
| | | 24 | | | | | 25 | | | |
| 26 | | | | | | 27 | | | | |
| | | 28 | 29 | | 30 | | | | | 31 |
| | 32 | | | | | | | | 33 | |

**అడ్డం**

2. ఒట్టు (2)
3. గందరగోళం (6)
8. దండోరా (3)
9. పుష్పాల తట్ట చెదిరింది (4)
10. రేర్‌గా లభించేది (4)
11. కలపడం (3)
13. ...... కుమారి పాతతరం నటి (3)
14. స్త్రీ (3)
15. ముండ్లు (4)
16. లెక్కించడం (3)
17. చల్లదనం (3)
18. సంతోషం (2)
19. శుభ్రపరచడం (2)
20. కిటికి (3)
22. క్యారెక్టర్ (3)
24. సుమారు (4)
25. చివరి పొన్ను (2)
26. దయ, జాలి (3)
27. వినాయకుని పూజా పత్రిలోని ఒక ఆకు (4)
28. రంగడి చివర తెగింది (2)
30. శివుని వాద్యం (4)
32. సువాసన (4)
33. కెరటం (2)

**నిలువు**

1. అడవి నివాసులు (5)
2. అడవిలోని శాకాహారం (6)
3. పిండి వంటలు (5)
4. బుట్టకు తోడు (2)
5. చిన్నపిల్లాడి స్నానం (2)
6. విసర్జిత సర్ప చర్మం (3)
7. ఉపవాసం – పరమౌషధం (3)
12. జ్ఞాపకశక్తి (5)
17. మంచి బ్రేక్ ఫాస్ట్ (2)
18. కైవల్యం (2)
19. మేలు కలిగించేది (2)
20. విషం (3)
21. గడ్డి కుప్ప (2)
22. ఆపోజిట్ (4)
23. క్రింద నుంచి వేదాంతం (2)
24. వార్ ఫీల్డ్ (4)
25. బొమ్మ (4)
27. మహేశ్వరుని భార్య (2)
29. భీముని ఆయుధం (2)
31. జాలం (2)

సమాధానాలు

## పదరంగం -30

| | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1స | త్య | శో | 2ధ | న | | 3పో | 4క | 5లు | | 6క్రో |
| మం | | | నుం | | 7వే | గు | ల | వా | రు | |
| 8జ | న | మే | జ | యు | డు | | | | | 9కా |
| సం | | | యు | | 10క | ల | 11వ | రిం | త | లు |
| | 12కా | 13ము | డు | | లు | | రూ | | | డు |
| 14రు | | క్తి | | 15బా | | 16అ | ధి | కం | 17గా | |
| ధి | | | 18శి | ల | | 19తి | ని | | 20ర | 21సం |
| 22రో | క | 23లి | | | | | | 24నో | | పూ |
| ద్గా | | 25నీ | 26చ | మా | 27న | వు | 28లు | | 29స్వ | ర్ణం |
| 30రి | 31ఉ | | ల | | ల | | 32దు | ర్మా | ర్గం | |
| | ష్ణ | | 33నం | ది | వ | ర్ధ | నం | | | 34త్రీ |

# సంక్షిప్త సింహపురి

## ఆ రైళ్లు ఆపండి!

నెల్లూరు మీదుగా నడిచే కోరమాండల్, గంగాకావేరి ఎక్స్‌ప్రెస్ రైళ్లు నెల్లూరు రైల్వేస్టేషన్‌లో నిలిపేలా తక్షణ చర్యలు తీసుకోవాలని రాజ్యసభ సభ్యుడు తిక్కవరపు సుబ్బరామిరెడ్డి రైల్వే ట్రాఫిక్ బోర్డు మెంబర్ కెకె.శ్రీవాత్సవకు లేఖ వ్రాశారు. రెండు నిమిషాలపాటు నెల్లూరుస్టేషన్‌లో ఈ రెండు రైళ్లు ఆపేలా చేస్తే వేలాది మంది ప్రయాణీకులకు మేలు చేకూరుతుందని ఆ లేఖలో స్పష్టం చేశారు.

## చిరంజీవి అభిమానుల రక్తదానం



రాజ్యసభ సభ్యుడు చిరంజీవి జన్మదినోత్సవాన్ని పురస్కరించుకొని నెల్లూరు మినీ బైపాసురోడ్డులోని మహేశ్వరి – పరమేశ్వరి కళ్యాణ మండపంలో మెగా రక్తదాన శిబిరం జరిగింది. శిబిరాన్ని సిటీ ఎమ్మెల్యే ముంగమూరు శ్రీధర్‌కృష్ణారెడ్డి ప్రారంభించారు. ఈ సందర్భంగా ఆయన మాట్లాడుతూ 2500 మంది చిరంజీవి అభిమానులు రక్తదానం చేసి చరిత్ర సృష్టించారన్నారు. మెగాస్టార్ జన్మదినోత్సవాన్ని పురస్కరించుకొని చిరంజీవి యువత ఆధ్వర్యంలో మద్రాసు బస్టాండు వద్దగల జూబ్లీ హాస్పిటల్‌లో రోగులకు రొట్టెలు, పండ్లు పంపిణీ చేశారు. ఈ కార్యక్రమంలో చిరంజీవి అభిమాన సంఘాల నాయకులు రాజ్‌కుమార్, కొట్టే వెంకటేశ్వర్లు, చంద్రశేఖర్‌రెడ్డి తదితరులు పాల్గొన్నారు.

## ఇసుక మాఫియాతో లింకులు

జిల్లాలో ఇసుక మాఫియా దందా సక్రమంగా సాగను మంత్రులు, ఎమ్మెల్యేలు సహకరించి లాభపడుతున్నారని సిపిఎం జిల్లా కార్యదర్శి చంద్రరాజగోపాల్ ఆరోపించారు. సిపిఎం పార్టీ జిల్లా కార్యాలయంలో విలేకరులతో మాట్లాడుతూ ప్రజాప్రతినిధులు ముడుపులు తీసుకొంటున్నందునే ఇసుక అక్రమ రవాణా సాగుతున్నా అటు పాలకులు గానీ అధికారులు గానీ పట్టించుకోవడం లేదన్నారు. ముదివర్తిపాళెం ఇసుక రీచ్‌ను మాత్రమే వేలం వేసి మిగిలినవాటిని వేయకపోవడం వల్ల జిల్లాలో ఇసుక కొరత తీవ్రంగా వుందన్నారు. దీన్ని అదనుగా తీసుకొని ఇసుక బకాసురులు ఒక్కో ట్రాక్టరు ఇసుకను 7వేల రూపాయల వరకు అమ్ముతున్నారన్నారు. నిబంధన ప్రకారం రెండు క్యూబిక్ మీటర్ల పరిమాణంలోని ఇసుకను 525 రూపాయలకు విక్రయించాల్సి వున్నా 15రెట్లు అధిక ధరకు విక్రయించడం వల్ల భవన నిర్మాణ కార్మికుల ఉపాధికి ఇబ్బందులొచ్చాయన్నారు. ఇసుక మాఫియా ఆటకట్టించను జిల్లా అధికారులు గట్టి కృషి చేయాలని రాజగోపాల్ డిమాండ్ చేశారు. పార్టీ నాయకుడు ఎం.మోహన్‌రావు కూడా ఈ సమావేశంలో పాల్గొన్నారు.

## తిప్పరాజు వెంకట సుబ్బయ్య సత్రం సాయం

నెల్లూరు ట్రంకురోడ్డులోని శ్రీ తిప్పరాజు వెంకట సుబ్బయ్య సత్రం పేద బ్రాహ్మణ విద్యార్థినీ విద్యార్థులకు ప్రతి ఏడాది మాదిరిగానే ఈ యేడాది కూడా ఉన్నత విద్య చదువుకోను ఆర్థిక సహాయంతో పాటు ప్రతిభగల విద్యార్థులకు స్కాలర్ షిప్పులు కూడా ఇస్తోంది. ఆసక్తిగల విద్యార్థులు సెప్టెంబర్ 15తేదీ దరఖాస్తులు సత్రంలో తీసుకొని పూర్తిచేసి పంపమంటున్నారు సత్రం మేనేజింగ్ ట్రస్టీ డాక్టర్ సర్వేపల్లి అజయ్‌కుమార్. www.nellorebrahmin.com వెబ్‌సైట్‌లోనూ దరఖాస్తులు అందుబాటులో వున్నాయంటున్నారు.

## హాస్టళ్లలో అన్ని సదుపాయాలు!

హాస్టళ్లలో వుంటూ చదువుకొనే పేద విద్యార్థులకు అన్ని సదుపాయాలు కల్పించాలని ఇన్‌ఛార్జి జాయింట్ కలెక్టర్ లక్ష్మీకాంతం కోరారు. తద్వారా వారిని ఉత్తమ పౌరులుగా తీర్చిదిద్దవచ్చన్నారు. కలెక్టరేట్‌లోని గోల్డెన్ జూబ్లీ హాల్‌లో హాస్టల్ వార్డన్లతో సమీక్షా సమావేశం నిర్వహించారు. ఈ సందర్భంగా ఆయన మాట్లాడుతూ హాస్టళ్లలో విద్యార్థులకు కంప్యూటర్ ద్వారా నెట్ సౌకర్యాన్ని కల్పిస్తామన్నారు. కంప్యూటర్లు సక్రమంగా పని చేసేలా ఆయా హాస్టళ్ల వార్డన్లు బాధ్యత తీసుకోవాలన్నారు. సాంఘిక సంక్షేమ శాఖ పిడి విశ్వమోహన్‌రెడ్డి, వెనుకబడిన తరగతుల శాఖ అధికారి కోటేశ్వరరావు, హాస్టల్ వార్డన్లు ఈ సమావేశంలో పాల్గొన్నారు.

## రెడ్‌క్రాస్ సొసైటీ ఎన్నికలు వాయిదా!

నెల్లూరు రెడ్‌క్రాస్ సొసైటీ కార్యవర్గాన్ని ఎన్నుకొనేందుకు నిర్వహించ తలపెట్టిన ఎన్నికలను ఇండియన్ రెడ్‌క్రాస్ సొసైటీ రాష్ట్ర ప్రధాన కార్యదర్శి ఆదేశాల మేరకు తాత్కాలికంగా వాయిదా వేసినట్లు జిల్లా కలెక్టర్ బి.శ్రీధర్ రెడ్డి ఒక ప్రకటనలో స్పష్టం చేశారు. ఎన్నికల తేదీని మళ్లీ ప్రకటిస్తామని రెడ్‌క్రాస్ జిల్లాశాఖ జీవిత సభ్యులు ఈ విషయాన్ని గమనించాలని కోరారు.

## పిట్ట కొంచెం... కూత ఘనం!



పై పోలిక నెల్లూరు కలెక్టర్ బంగ్లా సమీపంలో నివసించే మూడేళ్ల బాలిక చావ భార్గవికి అచ్చుగుద్దినట్లు సరిపోతుంది. భార్గవిని బాలమేధావని చెప్పొచ్చు. మాటలు కూడా సరిగ్గా రాని వయస్సులో 170 దేశాల రాజధానుల పేర్లు, రాష్ట్రాల రాజధానుల పేర్లు, 23 మంది నాయకుల పేర్లు, 7 ప్రపంచ వింతలు, జాతీయ గీతం, దేశభక్తి గీతాలు, 40 ఇంగ్లీషు పద్యాలు, హిందీ, తెలుగు పద్యాలు, 15 దేవతా శ్లోకాలు, హనుమాన్ చాలీసాను కేవలం 45 నిమిషాలలో టకటకా విలేకరుల ముందు 26తేది చెప్పేసింది. భార్గవి కుటుంబీకులంతా చదువరులు. తాత వాశిరెడ్డి రామారావు రిటైర్డ్ ఎంప్లాయిమెంట్ ఆఫీసరు. తండ్రి చావ సురేష్ పెళ్లకూరు మండలం తాళ్వాయిపాడు ప్రాథమికోన్నత పాఠశాల హెడ్‌మాస్టర్. తల్లి ఉషారాణి. భార్గవి ఒకసారి విన్న దేవతా శ్లోకాలను టకటకా చెప్పడం విని ఆమెను ప్రోత్సహించడంతో అబ్బురాలు సృష్టించే బాలికయ్యింది.



రైతు లోకం

## మేలుజాతి పాడి పశువుల ఎంపికకు సూచనలు!

మేలుజాతి పాడిపశువుల ఎంపికలో జాగ్రత్త పాటించాలని పశుసంవర్ధక శాఖ సంచాలకులు భాస్కర్ తెలిపారు. పాడిపశువులతో డెయిరి ఫారాన్ని ప్రారంభిస్తే ఆశించిన ఫలితాలు వస్తాయి. నమ్మకమైన వ్యక్తుల వద్ద 2–6 పళ్లు వచ్చిన పశువులను మాత్రమే కొనుగోలు చేయాలి. 8 పళ్లు వచ్చిన పశువులను కొనకూడదు. పశువులు ఈనిన 15 రోజుల తర్వాత లేగదూడతో సహా కొనాలి. ఒకటి లేదా రెండో ఈత పశువులను మాత్రమే కొనాలి. రోజుకు 10–12 లీటర్లు పాలిచ్చే ముర్రాజాతి గేదెలను, 16–18 లీటర్లు పాలిచ్చే సంకరజాతి ఆవులను కొనాలి. రెండు పూటల పాల దిగుబడి చూసి, దిగుబడి ఆధారంగా కొనుగోలు చేయాలి.

### శారీరక లక్షణాలు

పాడి పశువు తన ప్రత్యేక జాతి లక్షణాలను కలిగి వుండాలి. ఆకర్షణీయంగా నెమ్మది స్వభావం కలిగి వుండాలి. గొంతువాపు, దొమ్మ బ్రూసెల్లోసిస్ వంటి అంటువ్యాధులు వుండకూడదు. ముందు, వెనుక, ప్రక్క నుంచి చూసినప్పుడు పాడిపశువు త్రికోణాకారంలో కనిపించాలి. చర్మం సున్నితంగా, కళ్లు చురుకుగా మెరుస్తుండాలి. శరీరంతో పోల్చినప్పుడు పొట్ట పరిమాణం పెద్దదిగా వుండాలి. పొదుగు తొడల మధ్య విశాలంగా వుండి కణతులు లేకుండా మెత్తగా వుండాలి. రొమ్ములు ఒకే పరిమాణంలో చతురస్రాకారంలో వుండాలి. పొదుగుపై పాల నరాలు వుబ్బెత్తుగా స్పష్టంగా కనిపించాలి. పాలలో రక్తపు చారలు, గడ్డలు వుండకూడదు. ఇటీవల డెయిరి ఏర్పాటుపై పెరుగుతున్న ఆసక్తిని ఆసరాగా చేసుకొని అనుభవం లేని వారు సైతం పశువుల పంపిణీదారులుగా అవతారం ఎత్తుతున్నారు. ఇలాంటి వారిపట్ల అప్రమత్తంగా వుండాలి. మేలు జాతి పాడిపశువులను కొనుగోలు చేసి లాభదాయకంగా డెయిరిని నిర్వహిస్తున్న వారి సలహాలు, సూచనలు తీసుకోవడంతోపాటు పశుసంవర్ధక శాఖ అధికారులను ప్రోత్సాహికులు సంప్రదించిన తర్వాత ముందడుగు వేయడం మంచిదని ఆయన సూచించారు.

Regn.No. : RN 1156 / 57 J/Nellore/008/12-14

# యుపిఏ ప్రభుత్వ ముఖానికి అంటిన బొగ్గు మసి!

బొగ్గు పాపం బ్రద్దలైంది. ఎన్నో ఏళ్లుగా లోలోపలే కుతకుత వుడుకుతుండిన అగ్ని పర్వతం పేలి, అవినీతి లావా ప్రవాహం యుపిఏ ప్రభుత్వాన్ని ముంచెత్తుతున్నది. ఆ తాకిడికి ప్రధాన మంత్రి, సోనియాగాంధీ తుఫాను గాలికి చిగురుటాకుల వలె అల్లాడి పోతున్నారు. గజ గజ వణుకుతున్నారు. మన్మోహన్‌సింగ్ నేతృత్వంలో రెండవసారి అధికారంలోకి వచ్చినప్పటి నుంచి యుపిఏ ప్రభుత్వం అవినీతి మడుగులో మునగానాం, తేలానాం అన్నట్లుంది. లెక్కలేనన్ని అవినీతి కుంభకోణాలు వెలుగులోకి వచ్చాయి. వాటిలో కొన్ని లక్షల కోట్ల రూపాయల ప్రజాధనం అక్రమార్కుల జేబుల్లో దూరిపోయింది. కేంద్రమంత్రులు, ఎంతోమంది అధికారులు జైళ్లలో మ్రగ్గుతున్నారు. యుపిఏ హయాంలో జరిగిన కుంభకోణాల జాబితా చూస్తే, ఔరా అన్పించక మానదు.

| అవినీతి కుంభకోణం | జరిగిన నష్టం (కోట్ల రూపాయలు) |
|---|---|
| క్రైనెటిక్ ఫైనాన్స్ లిమిటెడ్ స్కాం | బ్యాంకులకు నష్టం – 200 కోట్లు |
| అల్ట్రా మెగా పవర్ ప్రాజెక్ట్ స్కాం | కేంద్ర ప్రభుత్వం అనిల్ రిలయన్స్ అంబానీ పట్ల చూపిన ప్రేమ, జరిగిన నష్టం – 29వేల కోట్లు |
| ఢిల్లీ ఎయిర్‌పోర్టు స్కాం | 3000 కోట్లు |
| ఫోరెక్స్ డెరివేటివ్స్ స్కాం | 32 వేల కోట్లు |
| సర్వీస్ టాక్స్, సెంట్రల్ ఎక్సైజ్ మోసం | 19,159 కోట్లు |
| గుజరాత్ పిఎస్‌యు స్కాం | 17వేల కోట్లు |
| మహారాష్ట్ర స్టాంప్ డ్యూటీ | 600 కోట్లు |
| ఫ్లైయింగ్ క్లబ్ స్కాం | 190 కోట్లు |
| ఇస్రో ఎస్ బ్యాండ్ దగా | 2లక్షల కోట్లు |
| కెజి బేసిన్ ఆయిల్ స్కాం | ఎంతో లెక్క తేల్చడం కష్టం |
| టట్రా ట్రక్కుల గోల్మాల్ | 700 కోట్లు |
| ప్రావిడెంట్ ఫండ్ స్కాం | 169 కోట్లు |
| ఆదర్శ హౌసింగ్ స్కాం | సైన్యం ప్రతిష్ట |
| కామన్‌వెల్త్ గేమ్స్ | 70వేల కోట్లు |
| గ్రామీణ ఉపాధి హామీ పథకం | లక్ష కోట్లు |
| ఐపిఎల్ క్రికెట్ | ఎంతో లెక్క తేలలేదు |
| మధుకోడా మైనింగ్ స్కాం | 4వేల కోట్లు |
| బియ్యం ఎగుమతుల స్కాం | 2700 కోట్లు |
| ఒరిస్సా ఇనుప గనుల స్కాం | 7వేల కోట్లు |
| క్యాష్ ఫర్ ఓట్ స్కాం | పార్లమెంట్ ప్రతిష్ట |
| సైన్యం రేషన్ స్వాహా | 5వేల కోట్లు |
| హసన్ ఆలీ నల్లధనం | 50వేల కోట్లు |
| ఎల్‌ఐసి హౌసింగ్ స్కాం | 10వేల కోట్లు |

## అవినీతి లెక్క చూస్తే కళ్లు తిరుగుతాయి!

ఇవి కాక ఆంధ్రప్రదేశ్, కర్నాటక, ఉత్తర ప్రదేశ్, ఒరిస్సా వంటి రాష్ట్రాలలో జరిగిన కుంభకోణాల జాబితా కూడా సేకరిస్తే, మహాభారత గ్రంథమంత అవుతుంది. వాటి లెక్క కూడా చూస్తే కళ్లు తిరిగి క్రిందపడి పోతాము. ప్రజల సంక్షేమానికి ఉపయోగపడవలసిన ప్రభుత్వ సొమ్ము ఒక ప్రక్క, జాతి మేలు కోసం వినియోగించవలసిన ప్రకృతి సహజ వనరులను మరొకప్రక్క పాలకులు, అక్రమార్కులైన ప్రైవేటు వ్యక్తులు కలిసి పందికొక్కుల వలె బొక్కడం అలవాటై పోయింది. భారతదేశంలో అవినీతి అనాదిగా వున్న మాట వాస్తవం. అవినీతి అనేది ప్రపంచ వ్యాప్త ప్రక్రియ అని, భారతదేశం అందులో ఒక్క భాగం మాత్రమే అని ఇందిరమ్మ ఒకసారి ప్రకటించారు. అయితే యుపిఏ ప్రభుత్వం వచ్చిన తర్వాత జరిగినంత, జరుగుతున్నంత దోపిడీ ప్రపంచ చరిత్రలో మరే దేశంలోనూ చూడలేము, చూడబోము.

## ఆర్థిక సంస్కరణలు కొంప ముంచాయి!

మనది విశాలమైన దేశం. ప్రకృతి సంపద అపారం. సహజ వనరుల లభ్యత అధికం. గత పాలకులు వీటిని భద్రంగా పరిరక్షించారు. ప్రకృతి వనరులనేవి జాతి సంపదగా పరిగణించారు. వాటిని ప్రజల మేలు కోసమే వాడాలని నియమం పెట్టుకొన్నారు. ప్రభుత్వ రంగ సంస్థలకు మాత్రమే వాటిని వినియోగించే విధంగా విధానాలు రూపకల్పన చేశారు. కానీ మన్మోహన్‌సింగ్ ఆర్థిక సంస్కరణల పేరుతో ఆ జాగ్రత్తలన్నిటినీ తారు మారు చేశాడు. సహజ వనరులను పారిశ్రామిక అవసరాలకు ఉపయోగపెడితే అభివృద్ధి పంచకళ్యాణి గుర్రం వలె పరుగెడుతుందని ఆయన విశ్వాసం. ప్రభుత్వ రంగ సంస్థల మీద ఆయనకు నమ్మకం లేదు. ప్రైవేటు కార్పొరేట్ కంపెనీలు, మరీ ముఖ్యంగా అమెరికాకు చెందిన బహుళ జాతి సంస్థలంటే ఎక్కడలేని మోజు. సహజ వనరులను వారికి అప్పచెప్తే, ఒకటికి పదింతల లాభం సంపాదించి దేశ సంపద పెంచుతారని గుడ్డి నమ్మకం.

కానీ కార్పొరేట్ కంపెనీలు దురాశకు మారు పేరనే నిజాన్ని ఆయన తెలుసుకోలేక పోయారు. తల దూర్చే సందిస్తే, గుడారం మొత్తం ఆక్రమించే ఒంటె కథ ఆయన విన్నట్లు లేదు. కార్పొరేట్ కంపెనీల పేరుతో దురాశపరులు, అక్రమాలకు అలవాటు పడినవారు, జాతి సంపదను కొల్లగొట్టి తమ జేబులు నింపుకోవాలని కుట్రలు పన్నే వారు దూరిపోతారని వూహించలేకపోయాడు మన్మోహన్‌సింగ్.

దాని ఫలితమే మొన్నటి 2జి స్పెక్ట్రం స్కాం. ఇప్పటి కోల్ గేట్ కుంభకోణం. మన దేశంలో బొగ్గు గనులు అసంఖ్యాకంగా వున్నాయి. కానీ ఉత్పత్తి మాత్రం చాలా తక్కువ. విద్యుత్ ఉత్పత్తికి, పారిశ్రామిక అభివృద్ధికి బొగ్గు ఎంత అవసరమో అర్థం చేసుకొన్న ఇందిరాగాంధీ 1976లో బొగ్గు గనులన్నిటినీ జాతీయం చేశారు. ప్రభుత్వ రంగ సంస్థలు తప్ప మరొకరికి వాటిలో అవకాశం లేకుండా చేశారు. ఎవరికి బొగ్గు కావాలన్నా కోల్ ఇండియా, సింగరేణి, మహానది కోల్ ఫీల్డ్స్ వంటి ప్రభుత్వ రంగ సంస్థల మీదనే ఆధారపడేట్లు చూశారు. అప్పట్లో విద్యుత్ ఉత్పత్తి రంగం కూడా పూర్తిగా ప్రభుత్వ నిర్వహణలో వుండేది కాబట్టి, ఎటువంటి వివాదాలకు అవకాశం లేకుండా నడిచింది.



జిల్లా మహిళా కాంగ్రెస్ అధ్యక్షురాలు పందిళ్లపల్లి అరుణమ్మ – పట్టాభిరామిరెడ్డిల మనవరాలు బేబి కామాక్షి జన్మదినోత్సవాన్ని జొన్నవాడలోని ప్రియదర్శిని వృద్ధుల అనాథ ఆశ్రమంలో 26తేది జరుపుకున్నారు.

## ప్రైవేటు వ్యక్తుల చేతికి గనులు

పివి.నరసింహారావు ప్రభుత్వంలో ఆర్థికమంత్రిగా చేరిన మన్మోహన్‌సింగ్, ఆర్థిక సంస్కరణల పేరిట 1993లో మొదటిసారిగా బొగ్గు గనులలో ప్రైవేటు వ్యక్తులకూ అవకాశం కల్పించాడు. కానీ పదేళ్లకు పైగా ఏ కార్పొరేట్ సంస్థ కూడా వాటిని స్వంతం చేసుకోలేక పోయింది. ఈ మధ్యలో బిజెపి నేతృత్వంలోని ఎన్డీఏ ప్రభుత్వం నడిచింది కాబట్టి, వారు బొగ్గు గనులను ప్రైవేటు వ్యక్తులకు ఇచ్చే సాహసం చేయలేకపోయారు. దానితో మన్మోహన్ సింగ్ ప్రధానిగా పదవి చేపట్టగానే దీనిపై దృష్టి పెట్టారు. పెద్ద ఎత్తున బొగ్గు గనులను ప్రైవేటు సంస్థలకు ఇస్తే తప్ప, విద్యుత్ ఉత్పత్తి పెంచలేమని భావించారాయన. ఆ ఉద్దేశం మంచిదే; కానీ అమలులోనే అక్రమాలు చోటు చేసుకొన్నాయి.

ప్రభుత్వానికి సంబంధించిన ఏ ఆస్తి అయినా ప్రైవేటు సంస్థలకు ఇవ్వాలనుకొన్నప్పుడు వేలం పెట్టడం, టెండర్లు నిర్వహించడం, మరొక రకమైనా పోటీ వాతావరణం కల్పించడం కనీస ధర్మం. దాని వల్ల సహజ వనరుల కేటాయింపులో పారదర్శకత ఏర్పడుతుంది. ధర్మమైన ధర లభిస్తుంది. కానీ కార్పొరేట్ రంగ సంస్థల ఒత్తిడికి తలొగ్గిన మన్మోహన్ సింగ్, ఈ విషయంలో తప్పటడుగు వేశాడు. కార్యదర్శుల స్థాయిలో ఒక కమిటీ వేసి, దరఖాస్తు చేసుకొన్నవారిలో అర్హులను నిర్ణయించి, గనులు కేటాయించే ప్రక్రియకు ఆమోదం తెలిపాడు. దానితో ఆషాఢభూతులు, దురాశాపరులు, బొగ్గుతో ఏ సంబంధమూ లేని వారు, దానితో కోట్లు కూడబెట్టాలనుకొన్నవారు రంగంలోకి దిగారు. మొత్తం 155 గనులను కేటాయిస్తే, 30 లేదా 40కి మించి నిజమైన వినియోగదారులు లేరు.

## కుటిల యత్నం

స్పెక్ట్రం కేటాయింపులో జరిగింది కూడా ఇటువంటి మోసమే. మొదట వచ్చిన వారికి మొదట కేటాయింపు అనే పద్ధతి పాటించడం వల్ల, రియల్ ఎస్టేట్ కంపెనీలు, ప్రభుత్వంలో పలుకుబడి కల్గిన బ్రోకర్లు స్పెక్ట్రంను చవకగా చేజిక్కించుకొన్నారు. ఆ వెంటనే దాన్ని అధిక ధరలకు అమ్మి, వేల కోట్ల రూపాయలు మూట గట్టుకొన్నారు. ఇక్కడా అటువంటి కుటిల యత్నమే నడిచింది. అయితే బొగ్గు గని త్రవ్వకం అంత తేలికైన పని కాదు. సాధారణంగా ఈ గనులన్నీ అటవీ ప్రాంతంలో వుంటాయి. పర్యావరణ అనుమతులు తెచ్చుకొంటే తప్ప గనిలో పార పెట్టి త్రవ్వలేరు. పర్యావరణ అనుమతి కష్టమైన విషయం. మరొకప్రక్క గనులున్న ప్రాంతంలోని గిరిజన ప్రజల సంక్షేమం కూడా చూడాలి. చాలా చోట్ల తమ ఇళ్లు ఖాళీ చేసి పోవడానికి గిరిజనులు అంగీకరించరు. ఎదురు తిరుగుతారు. వారిని సముదాయించేందుకు ఏళ్లు పూళ్ల సమయం పడుతుంది. ఈ రెండు కారణాల వల్ల 2006 నుంచి 2009 సంవత్సరాల మధ్యనే గనులు కేటాయింప చేసుకొన్నప్పటికీ తొంభైశాతం మంది తతిమా అనుమతులు తెచ్చుకోలేకపోయారు. దానితో వాటిని

కొరవ 14వ పేజీలో


అశ్రునివాళి

మా కళాశాల వ్యవస్థాపకులు, అధ్యక్షులు, కళాశాల నిర్మాణ శిల్పి, మా శ్రేయోభిలాషి, నిరంతర శ్రామికుడు, నిగర్వి, సేవాతత్పరులు, విద్యాదాత శ్రీ అల్లారెడ్డి శ్యామసుందర్‌రెడ్డి గారి హఠాన్మరణం మాకు తీరనిలోటు. వారి పవిత్రాత్మకి చిరఃశ్శాంతి కలగాలని అశ్రునయనాలతో ఆ భగవంతుని ప్రార్థిస్తూ... వారి కుటుంబ సభ్యులకు మా ప్రగాఢ సంతాపాన్ని తెలియజేస్తున్నాము.

కీ.శే. అల్లారెడ్డి శ్యామసుందరరెడ్డి గారు
అధ్యక్షులు డిఆర్‌డబ్ల్యు కళాశాల, గూడూరు.

యాజమాన్యం, ప్రిన్సిపాల్, బోధన, బోధనేతర సిబ్బంది మరియు విద్యార్థినులు
దువ్వూరు రమణమ్మ మహిళా కళాశాల, గూడూరు


Edited, Printed and Published by N. Dolendra Prasad. Ph: 091-861-2327354, Offset Printing at Zaminryot Press, Nellore. E-mail : jaminryot@yahoo.com